కాకినాడ శ్రీకళా విజ్ఞాన గ్రంథమండలి

ద్వితీయకుసుమము.

# సంపూర్ణమహాభారతము.



వ్యాసాశి, శ్రీకృష్ణావతారము, వనసుందరి, విహారలీల
మొదలగు పదినాటకముల వ్రాసి శ్రీయరవిందఘోషుగారి
యోగసంకలనము తర్జుమాచేసిన

మహావ్రశ్రీ చార్తాబాదా గోపాలకృష్ణారావు, B. A,
గారిచే రచింపఁబడి ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:

సిటీ ముద్రణాలయమున ముద్రింపఁబడినది.

1932.



[వెల రు 1-0-0.



ఈనాటకమును మొదట ప్రదర్శించుటకు బహుశ్రమ పడినవారు మహారాజశ్రీ పళ్లె వెంకటహనుమంతరావుపంతులు గారు. మ॥ రా॥ శ్రీ సింగితపు అబ్బాయిగారు స్వర్గస్థులయ్యిన పిదప వీరు నాట్యకళాపోషణకు కాకినాడపురమున 1908 మొదలు శ్రమపడి ఆంధ్రసేవాసంఘమునకు సరస్వతీభవన నిర్మాణ మొనరించి కారణాంతరమున శ్రీ విజయభారతసభకు కార్యదర్శులైరి.

# నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి.

## రాజపోషకులు:—

1 మ॥రా॥రా యస్. బలరామమూర్తి నాయుడుగారు,
బి. ఏ., బి. యల్., చెన్నపట్టణం.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి, ఏ.,
సబ్ మేజిస్ట్రేటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుడుగారు డి. పి. డబ్లి
యూ అసిస్టాంటు ఇంజనీరు. పెర్మనెంట్ లింగారెడ్డిపాలెం.

## పోషకులు:—

4 ,, పైడా శ్రీరామకృష్ణయ్య బ్రిదర్సు,
జమీందార్లు, కాకినాడ.

5 ,, వారణాసి బాపయ్యగారు. బి. ఏ., క్యాషియరు,
డి. కో. బ్యాంకి, చెన్నపట్టణం.

6 ,, ముత్యాల సత్యనారాయణమూర్తిగారు,
రామచంద్రపురం.

7 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు. డిటో

8 ,, మాజేటి మునెయ్యగారు; బి. ఏ., బి. యల్.,
రాజమండ్రి.

9 ,, ముత్తా సత్యప్రసన్నం బ్రిదర్సు, బ్యాంకర్సు,
కాకినాడ.

10 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఆకిరిపల్లి.

11 ,, వెలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.

12 ,, చిత్రపు సుబ్బారావుపంతులుగారు,
తహశీలుదారు, అవనిగడ్డ.

13 ,, చిరావూరు కామేశ్వరావుగారు, అవనిగడ్డ.

14 ,, ధూళిపాళ్ల వెంకటరత్నగారు, గ్రామమునసబు
పురుషోత్తపట్నము.

14 ,, దర్భా వెంకటశివరామరావ్ బి. ఏ., బి. యల్.,
కాకినాడ.

16 ,, చెలికాని రామస్వామిబాబుగారు,
అసిస్టెంటుయింజనీరు, సామర్లకోట.

17 ,, సర్భదా శేషగిరిరావుపంతులుగారు, కాకినాడ.

18 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు ప్లీడరు
కాకినాడ.

19 ,, కొత్త వెంకటరత్నంగారు, Officer De Acafinee.
Chenaliar do & Sclelr Nares de. Beeni Cocanada.

20 ,, దసిగ వెంకటేశ్వరావుగారు, గుడివాడ.



# ఉపోద్ఘాతము.

సంపూర్ణమహాభారతపురాణమున పెక్కునాటకములకుఁ దగిన విషయములు గలవు. అట్టి మహాపురాణమును మూఁడంకముల నాటకముగా వ్రాయుటకు సాహసించితిని కథ పోకుండ ముఖ్యాంశముల నెన్నుకొని నాటకరచనకుఁ బనికివచ్చు సందర్భములనే ప్రదర్శనార్హముగునట్లు నిర్ణయించితిని. ఈనాటకమున పదునెనిమిది రంగములు కలవు. భారతమునకు నాయకుఁ డితఁడని నిర్ణయించుట కష్టసాధ్యము. కనుక రంగమున కొకని నాయకుని జేసి నవరసభరిత మగునట్లు ద్రాక్షపాకమున పద్యగద్యముల రచించితి. ప్రస్తుతరంగస్థలమున కనుగుణ్యముగా నీ నాటకరాజము రచింపబడినను, త్వరితముగా ప్రదర్శించిన నాలుగు గంటల కాలము నకన్న నెక్కువ బట్టుకున్నను పాత్రబాహుళ్యమును జూచి యెందఱో నటులీనాటకమును ప్రదర్శించుటకు భయపడిరి. కాని కాకినాడ విజయభారతసభకు కార్యదర్శియు నాట్యకళాపోషమునకు కంకణముకట్టుకొని మహానాటకముల ప్రదర్శనకై జీవితమంతయు ధారపోసిన మహారాజశ్రీ పళ్లె వెంకటహనుమంతరావుపంతులుగారు రాత్రింబవళ్లెన్నియో మాసములు శ్రమపడి యీనాటకమును మొదట 24-11-1930 కాకినాడలో ప్రదర్శించిరి. పిఠాపురమందును మరల కాకినాడయందు ప్రదర్శించిరి. వీరికి గ్రంథకర్త సదావిధేయుఁడు.

24-11-1930 తేదీని యీనాటకమును మొదట ప్రదర్శించిన శ్రీ విజయభారతసభవారి నటశిఖామణులనీ నామముఁ గ్రిందఁ బేర్కొనుచున్నాఁడ.

కాకినాడ
11-8-32

దాల్తాబాదా గోపాలకృష్ణారావు, బి. ఏ.

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణుడు— | మ॥రా॥ | ఉప్మాక కామేశ్వరరావుగారు |
| ధర్మరాజు— | ,, | మద్దాలి శేషగిరిరావుగారు |
| భీముడు— | ,, | దేవళ్ళ సుబ్బన్నచౌదరీగారు |
| అర్జునుడు— | ,, | దేవులపల్లి పద్మనాభశాస్త్రిగారు బి. ఎ బి. ఇడి. |
| అభిమన్యుడు— | ,, | ఇమ్మిడి సత్యనారాయణగారు |
| భీష్ముడు— | ,, | కూచిమించి సత్యనారాయణగారు |
| ధృతరాష్ట్రుడు— | ,, | గోవిందరాజుల వీరభద్రరావుగారు |
| దుర్యోధనుడు— | ,, | మారేమండ నరసింగరావుపంతులుగారు బి. ఎ. |
| దుశ్శాసనుడు— | ,, | శొంఠి సత్యనారాయణగారు |
| కర్ణుడు— | ,, | క్రొవ్విడి విశ్వనాథంగారు |
| శకుని— | ,, | పెద్దిభొట్ల లక్ష్మినారాయణగారు |
| విదురుడు— | ,, | రాచకొండ ఆంజనేయులుగారు |
| వికర్ణుడు— | చిరంజీవి | నేమాని వెంకట్రావు |
| ద్రోణుడు— | మ॥రా॥ | జానకిరామయ్యగారు |
| పరమేశ్వరుడు— | ,, | ముప్పిడి జగ్గరాజుగారు |
| శిశుపాలుడు— | ,, | పల్లె వెంకటహనుమంతరావుగారు డి. సి. |
| కీచకుడు— | ,, | సయ్యద్ జాన్ సాహెబుగారు |
| దృష్టద్యుమ్నుడు<br>శల్యుడు | ,, | అల్లంరాజు వెంకటరావుగారు |
| ద్రౌపది— | ,, | కొండి శ్రీహరిరావుగారు |
| ఊర్వశి— | ,, | నేమాని సోమశేఖరంగారు |
| పార్వతి— | ,, | డి. వి. సుబ్బారావుగారు |

కాని, పులి మేకల నొక రేవున నీరుఁ ద్రాగించుచున్నావు. అబ్బా! నీప్రజ్ఞ! ఎట్టి స్వతంత్రాభిమానులనైనఁ బాదాక్రాంతుల నొనరించి, వివిధసేవకవృత్తుల రోతజనించుఁ బెఱునీచమార్గములఁ గింకరులఁ జేసి త్రిప్పుచున్నావు. ఎట్టి మదోన్మత్తులకైన, నెట్టి ధనమదాంధులకైన, నెట్టి రాజ్యగర్వాన్వితులకైన నీశాసన మంటనీయమని విఱ్ఱవీఁగుచుంటివి. కాని, నీయున్నతపదవినుండి, నీయధికారమహోన్నతశిఖరమునుండి యెన్నఁడో యొకనాఁడు పడకఁ దప్పదు. కాలగతిచే నోడలు బండ్లుగా బండ్లోడలుగా మారును. కాలచక్రభ్రమణమున నీచస్థానగతమగు చక్రనేమి యుచ్చస్థానముఁ బొందక తప్పునా? అట్టి యున్నతస్థానము నిత్యమని తలుపవచ్చునా? అధఃపతనము దానివెంట నంటియున్నది సుమా. ఎందఱు రాజాధిరాజు లెందఱు చక్రవర్తులు పదవిచ్యుతులు కాలేదు?

ఉ. రావణుఁ డీల్గఁడే! నహుష♦రాజన్యుఁడు చావకుండెనే?
పావనులైన దేవతల ♦ బాధలఁ బెట్టు హిరణ్యకశ్యపుం
డావనజాక్షుచేఁ బడఁడె? ♦ యామహిషాసురుఁ డంతమొందఁడే?
చావు నిరంకుశప్రభుల ♦ చక్కిని ఛాయకఁ గాచియుండదే?

ఓ సుయోధన చక్రవర్తీ! సజ్జనుల నీ వెట్టి మాయోపాయముల నణఁగఁద్రొక్కుచున్నను శిష్టులకుఁ దోఁడు దైవ మున్నాఁడు. పాండవుల నెట్టి యిక్కట్టులఁ బాలుచేసితివి! భీమునిబలమునకు సహింపలేకఁ బాశంబుల బంధించి గంగలోఁ బడవేసితివికదా! అంతటితోఁ దృప్తిఁ గాంచితివా? నిరపరాధులగు వారిని భుజింప రప్పించి యారగింపనున్న యన్నములో విషముఁ బెట్టించితివే! అంతటితో సంతుష్టిఁ జెందితివా? నీజ్ఞాతివైరము చల్లారెనా? నీయాశాపిశాచమునకు నైవేద్యము చెల్లెనా? అందఱుగుమిఁగూర్చి యీలాక్షాగృహంబున మాతాసహితంబుగ నంతమొందింపఁ జూచుచుంటివా! సేవకవృత్తి యెంత నిర్భరమైనది! యుద్ధభూమిని యోధాగ్రేసరులతోఁ బోరాడు నేనేడ! ఈగృహంబునకుఁ జిచ్చిడి నిర

పరాధులఁ జంపుచుండఁడ? అయ్యో ! నాబ్రతుకు ! దైవమా ! నన్నీ గతికిఁ దెచ్చితివా? తప్పదు ! చేయకఁదప్పదు. రాజాజ్ఞ మీరఁ గలనా ? అదే కిరాతస్త్రీ వచ్చుచున్నది. ఈచాటున దాగి సమయ మునకు వేచియుండెద.

(నిష్క్రమించును.)

[కిరాతస్త్రీ యైదుగురుపిల్లలతోఁ బ్రవేశించును.]

కల్లుపాట.

కిరాతస్త్రీ—

1. కల్లైతే బల్ మేలురా-ఈలోకమంత-కల్లైతే బల్ సోకురా॥
   అహాకల్లు ! ఒహోకల్లు ! ఈతకల్లు ॥క॥
2. ఇల్లువాకిళ్లెల్ల । కల్లుతో నింపక
   నీళ్లేల చేశాడో । నల్లకాటిబొమ్మ ॥క॥
3. కల్లుసూడనివాఁడు । కలనైన ఁగానరాఁడు
   కల్లుత్రాగనివాఁడు । కలికానికే లేఁడు ॥క॥

బొమ్మదేవరా ! నీకు నాలుగు నోళ్లే ! మదిర సవి సూడ వేమి ? నీనోళ్లు సెవులుకోసిన నక్కవలె తెగవాగుటకా ? కల్లురుసిసూడ వేమి ? నీకొంపకూల ! నీళ్లెందుకయ్యా ! బిడ్డలారా ! ఇదుగో ! స్వర్గలోకంనీరు. తాగి చిరంజీవులుకండి. (పిల్లలుత్రాగి పడిపోవు చున్నారు.) పురోచనుఁడు కుంతెమ్మను బిడ్డలఁగనిపెట్టుమని నన్నం పినాఁడు. పండుకొని కనిపెట్టెదను.

(త్రాగి పడిపోవుచున్నది.)

[కుంతి ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులు ప్రవేశము.]

కుంతి—కుమారులారా !

గీ. పాండుభూవిభుఁ డేగినఁ ♦ బంచలందుఁ
   జేరితిమి కద ! తెరవేదో ♦ చెపుడు మనకుఁ

కృపణవృత్తినిఁ గృత్రిమగృహముఁ గట్టి
యుండఁ బంచెను దయ చాల నుండినటుల.

ధర్మ—తల్లీ! దుర్యోధనుఁడు మనల మోసపుచ్చఁదలచినాఁడు. స్పష్టము. ఈభవనమో!

ఉ. దూలము గట్టిలేదు, తల దూలిన సర్వముఁ గూలు నేలపై,
నీలపుగోడచేటు గన నేర్పునఁ బెట్టినఁ జందమొప్పచే;
మూలలఁ దాపటంపుపని మోసము వెల్లడిచేయుచుండె, యీ
వాలకమంతఁ జూడ నని వార్యము ఘోరమటంచు దోచదే.

భీము—అన్నా! ఇందుండనేల? వేరుగృహంబునఁ బ్రవేశింతము.

ధర్మ—రాజాన్వేషణముఁ దప్పించుకొనఁ గలమా? మనలు వంచింప వేరుమార్గములఁ బన్నకుండునా?

గీ. పాఱిపోయినఁ దప్పునా? పట్టుఁబడక
దూరఁ దావేది? వెతుకఁడే? దొడ్డదొరకు
హద్దులున్నవె? దేశంబు లతనివగుటఁ
జిక్కకుందుమే? యెచ్చటఁ జిక్కు సుఖము.

పాఱిపోయిన ఫల మేమి? ఇందుండి వారి యూహల నిరర్థకములఁ జేయవలయు.

[ఖనకుఁడు ప్రవేశము.]

ఖన—పాండవులకు జయము, జయము. దేవా! రహస్యము. పరులు లేరుకద? ఈపరుండిన వారెవరు?

కుంతి—బిచ్చమెత్తి జీవించు కిరాతస్త్రీ. నిద్రించియుండును.

ఖన—కాదు. కాదు. మీరహస్యములఁ గనిపెట్టఁ బురోచనుఁ డంపిన చారిణి. నిద్రించినది. విదురుఁడు నన్ను మీకడ కంపె.

క. లక్కతో నిర్మించినదట
మక్కువ బుట్టించు నట్టి మందిర మిందుఁ
జిక్కితి రీరోజునసే
చెక్కెదరట వహ్ని నిందుఁ జెప్పగఁ బనిచెన్.

ధర్మ—విదురుఁడు తండ్రివలె సదా మమ్ముఁ గాపాడుచుండు.

ఖన—నేలఁ ద్రవ్వుటకు నాదగ్గఱ సూకర మూషికాది యంత్రములు వేలకొలది కలవు. ఒకత్రుటిలో నీమందిరంబునుండి వెలికి సురంగమార్గముఁ జేసెద. ఈమందిరము వీతిహోత్రున కర్పించి సురంగ మార్గమున నిర్గమింపుడు.

(మార్గముచేయఁ బోవుచున్నాఁడు.)

కుంతి—బిడ్డలార ! దుర్యోధనున కేమి యపకార మొనరించితిమి ? చలముఁబట్టి పల్లార్చుచున్నాఁడే.

అర్జు—అమ్మా ! దుష్టులకుఁ గారణములతోఁ బనిలేదు. తేలునకుఁ గొండివిసరుట, పామునకుఁ గాటువేయుట యెట్లో యట్లే యపకారమొనరించుట దుర్జనులకు స్వభావము.

ఖనకుఁడు—(ప్రవేశించి) ధర్మరాజా ! దారిసిద్ధమైనది. త్వరపడుడు.

భీము—గీ. తొల్లినాయన్న లంకనుఁ ♦ దోకతోడఁ
గాల్చినట్టులఁ గాల్చెద ♦ కరగి నేలఁ
గూలఁబడుఁగాక, వేవేగఁ ♦ గురుకులంబు
చెడుట కిదియెపో మొదటిదా ♦ చిహ్నమనగ.

సోదరులారా ! మనయమ్మను ముందిడికొని బిలమార్గమున నిర్గమింపుడు. నేనిదే చిచ్చుఁబెట్టి, కౌరవేశ్వరుని వైభవవినాశమునకు మొదటిసూచనయనఁదగినట్లు క్రూరునిగృహమును దహించి మీవెంట నంటి వచ్చెద.

(పాండవులు బిలమార్గమునఁ బోవుచున్నారు భీముఁడు నిప్పుఁబెట్టి పారిపోవుచున్నాఁడు.)

కిరాతస్త్రీ—బాబో-చస్తిమి- ఇదేరిటో ! బాబయ్యో ! నాయనో ! చస్తిమి - చస్తిమి. (కాలి పడిపోవుచున్నారు.)

రంగము పూర్తి.

## మొదటియంకము.—రెండవరంగము.

### ద్రౌపదీస్వయంవరము. మత్స్యయంత్రము.

[ద్రౌపదీ దృష్టద్యుమ్నులు, శిశుపాలాదులు, బలరామకృష్ణులు ప్రవేశము.]

కృష్ణ— కీర్తన.

1. వినుతదివ్యతేజా । యగ్నిజా ॥వినుత॥
   వేడుకసేయదె । విమలసరోజా ।
   వికచనయనజలజా॥ అగ్రజా ॥వినుత॥
2. దోషములేనిదె । ద్రుపదతనూజా ।
   దురితరహిత కులజా । అగ్రజా ॥వినుత॥

బల—అగ్నిహోత్రమున నుద్భవించిన యీపవిత్రగాత్రికిఁ దగిన వరుఁడెవఁడై యుండు. కృష్ణా ! మత్స్యయంత్రముఁ గొట్టి యీనిర్మల చరిత్రనుఁ బాణిగ్రహణంబొంద మనయర్జునుఁడే తగినవాఁడు. పాండవులజాడ తెలియరాదేమి ?

కృష్ణ — అన్నా! బలరామ! ఆ రహస్యముఁ దెలుపమందువా? వినుము.

సీ. విదురుఁ డంపినవార్త ♦ వినిపాండునందనుల్
లాక్షాగృహంబున ♦ లయముగాక

బల—బ్రతికియుండిరా ?

కృష్ణ—బలుని హిడింబుని ♦ బరిమార్చి వనమందు
మారువేషములతో ♦ మసలినారు

బల—ఇప్పుఁ డెచ్చటనున్నారు ?

కృష్ణ—ఏకచక్రపురము ♦ వీఁకతోఁ జేరిరి
బకదైత్యుఁ జంపిరి ♦ బాహుబలిమి
భిక్షాటనంబున ♦ బీదలై యాహారుఁ
దిరుగుచున్నారయ్య ♦ దిక్కులేమి

బల—అయ్యో!

కృష్ణు—గీ. పుడమిసురవేషములఁ దాల్చి ♦ పొట్టఁబోసి
కొనుచు నీవీట మనయత్త ♦ కుంతిఁగూడి
తిరుగుచున్నారు హలపాణి! ♦ దివ్యమతులఁ
బాండవేయులఁ జూతువు ♦ పెండ్లిలోన.

బల—పాండునందనులఁజూచుటకు నామనస్సు వేగిరఁబడుచున్నది. పెండ్లిమంటపముఁ జేరఁబోదము రమ్ము. (సమీపింతురు.)

దృష్ట—మహావీరులార! ఈతలోదరి నాముద్దుచెల్లెలు. సకలసుగుణాఢ్య. నవయౌవనభరిత. ఈమత్స్యయంత్రమును నీట లక్ష్యమిడి యీధనువుచే నైదుబాణముల నేసిన వానికీమెనిచ్చి పరిణయంబొనరించెదము.

వెంకయ్యావధానులు—సుబ్బావధానులు! ఒకదెయ్యి చూస్తావా యేమి? వాతంనొప్పిచేత నాకాలు లేవకున్నది. యంత్రం గింత్రం యెూంటికాలితోఁ గొట్టనా!

సుబ్బావధానులు—నాకు మశూచకములోఁ గంట్లోఁ బుడ్డువేసి దృష్టి తగ్గినది. లేకున్న బాణం గీణం యెందుకు? తేరఁబారి పైకిఁ జూస్తే యంత్రం తెగి క్రిందకూలదా?

వెంక—పుల్లయ్యశాస్త్రీ! ఒకదెబ్బ తీస్తావాయేమి? ఎట్లాగా పుల్లగా బుట్టముక్క బాగున్నదోయి

పుల్లయ్యశాస్త్రి—గోడదాటి దొడ్డిలోకివెళ్లినానని, పీడకడుపుడక, సుబ్బావధానులు నానడుం విరుగఁగొట్టినాడు. నడుం లేవనివ్వదు. లేకుంటేనా? విల్లెందుకు? కృష్ణాష్టమినాఁడు వుట్టికొట్టినట్లు యంత్రం యెగిరి కొట్టనా?

శిశుపాలుఁడు—

చ. ధనువన నెంత? పాదమునఁ ♦ దన్నిన యోజనమేగుఁ జేతులన్
బెనఁగుటయేల కాలిపని ♦ పెంపు వహించునె చేతఁజేయగా?
మనసిజుబారిఁ జిక్కితిని ♦ మానినిఁ గాంచినదాదినుండి యీ

ధనువునవేసి యంత్రమిటఁ • దన్వినిఁ జేకొనిఁ బోదునింతలో.

ఎడమచేతనెత్తిచూచెద. అబ్బా! కుడిచేతికిఁ బనిఁగల్పించినదే! అబ్బో! రెండుచేతులు కావలెనా? — ఛీ! వలదుకోతివలెనున్న యీ కాంత నాకేల (లేచిపోవుచున్నాఁడు.)

వెంక — శిశుపాలుఁడు పప్పుజారినట్టు జారుచున్నాఁడు.

జరా — చేతఁగాక శిశుపాలుఁడు పారిపోవుచున్నాఁడు. ఈగదాధారి, జరాసంధుఁడు కాంతను విడిచిపోవువాఁడు కాఁడు. ఈమత్స్యయంత్రి మన సెంత- గోట మీటనా? త్రాడు లాగిచూచెద-ఉహు! రాదేమి? (చతికిలఁబడి) సఘుము వయస్సుచెల్లిన నాకేటికి వివాహము. (పోవుచున్నాఁడు)

వెంక — జరాసంధుఁడు జండాపాటుకి నడచుచున్నాఁడు.

దుర్యో — గీ. చేదినాథుఁడు పుఱకేగెఁ • జేతఁగాకఁ
బోయె నిజరాసంధుఁడు • పొలఁతి విడచి
కార్ముకం బెంత! యంత్రముఁ • గలచుటెంత!
మనుజలోకము చూడుఁడీ • మహిమనాదు.

అయిదు బాణములేల? ఒక్క శరముతో యంత్రముఁ బడఁగొట్టనా? (మోకారించి) అబ్బా! ఎంతబరువుగా నున్నది. (ఎక్కుడలేక) నాబలము నిరర్థకము. నాకేల వివాహము. మదర్ధాంగలక్ష్మియగు భానుమతీపవిత్రకంఠాశ్లేష రోచితంబులగు నీబాహువల్లరీ నిచయంబు మరియొక తన్వినిఁ గౌఁగలించనోపవు. ఏకపత్నీదీక్షాపరుండగు నీదుర్యోధన సార్వభౌముఁడు ద్రౌపదీసౌందర్య పాశబంధంబునకుఁ గట్టుపడఁడు.

వెంక — చక్రవర్తిగారినెత్తికిఁ జేతులు వచ్చినవి.

కర్ణ — గీ. సూదిమొన మోపునంతటి • చోటులున్న
సూటి దప్పక నేతు నా • సునిసితశర
కోటులు వ్యర్థమైపోవు • కొట్టి యంత్ర
మతివఁ గొంపోదుఁజూడనీ • యవనిపతులు.

వెంక—రారాజులకైనది. మంత్రిగారిపాట్లు జూడవలెను.
కర్ణ—ధనువులావు (దెబ్బవేయఁ దప్పిపోవును.) కార్ముకముల వెన్నిటి
నో కాంచితి. ఇట్టిదానిఁ గనియుండలేదు. (వైతొలగును.)
వెంక—పద పద. రథంతోలుటకాదు.

[అర్జునుఁడు బ్రాహ్మణవేషముతో లేచి ధనువుసమీపించును.]

వెంక—సుబ్బావధానులు ! చూఁడవోయి ! వీఁడిలావు ! వీఁడినీఁటు !
వీఁడిగోఁటు ! వీఁడి రొమ్ముట్రొమ్ము గ్రామదేవత పీఠమంతయున్నది.
ఎక్కడిదక్కడ సమర్చినట్లున్నది దేహం. ఎక్కడివాఁడు ? ఎవరి
సుపుత్రుఁడు ? సుపుత్రః కొంపపీకరా యని రాజులకు మూకఁ గల
హం పెడుతావా యేమి ?

ద్రౌపది—గీ. గర్వితులుగారె ! రాఁజులు ♦ ఘనతఁ జెప్ప
కొనుటతోసరి; కార్యము ♦ గూడఁ బడదు.
బాఁపఁ డీతనిఁ గాంచినఁ ♦ బంచబాణ
వశతమేన్వొంగెఁ దీరునా ♦ వాంఛితములు ?

అర్జు—ద్రుపదరాజకుమారా ! ఈ యంత్రము క్షత్రియులు మాత్రమే
కొట్టవలెనా ? బ్రాహ్మణులుసహితము గొట్టవచ్చునా ?
దృష్ట—బ్రహ్మక్షత్రియు లెవరైనఁ గొట్టవచ్చును. యంత్రముభేదించు
వానికి నాసోదరినిత్తుము.
వెంక—దుడుకువాఁడే ! ఏమగునో ? (అర్జునుఁడు విల్లెత్తి యెక్కుడు
చున్నాఁడు.)
వెంక—సుబ్బావధానలు ! పుల్లయ్యశాస్త్రీ ! రాలేమోయి ? రాలే
మోయి ? బ్రాహ్మణులరొట్టె నేతిలోఁబడినది. తెండి ! తెండి !
కట్టు ! బుడిచెంబు- కౌపీనఁకట్టి యెత్తండోయి- బుడిచెంబులజెండా!
ఎత్తవోయి ! అహ ! హా ! హా ! (నవ్వి) బ్రాహ్మణధ్వజం-
(జెండాయెత్తి యర్జునుని వెనుక నిలుచును.)
కృష్ణు—అన్నా ! బలరామ !
ఉ. వచ్చినవాఁడు, చూఁడు మదె ♦ వాసవపుత్రకుఁడర్జునుండు శే

వచ్చెడివాఁడు వాయుజుఁడు, ♦ వానికి వెన్కను నిల్చువాఁడె యా
సచ్చరితుండు ధర్మజుఁడు, ♦ చాటున నుండిన వారలేకవల్
చిచ్చునఁ జావుదప్పి కఁడుఁ ♦ జిత్రము చేరిరి పెండ్లికూర్మికిన్.

బల—యంత్రమర్జునుఁడు వేయఁగలఁడా ?

కృష్ణు—అనుమాన మెందుకు ? (అర్జునుఁడు మొదటిబాణముననే యంత్రముగొట్టెను.)

వెంక— ఏమోయి ! సుబ్బావధానులు ! పడ్డది ! పడ్డది ! రావోయి ! రావోయి! బ్రాహ్మణులు కోటలోపాగా వేసినారు. (జండాయెత్తి గంతులు వేయుచున్నాఁడు.)

ద్రౌప— గీ. జన్మసార్థకమయ్యె నీ ♦ జనులమధ్య
నవతరించిన విష్ణుఁడో ? ♦ యమరవిభుఁడో ?
తమ్మిచూలియొ ! శూలియో ? ♦ తరమె యెరుగ
కీర్తనువు నెక్కఁబెట్టఁగా ♦ నిహమునందు.

ఈవిశాలవక్షమునందు నామనస్సు లగ్నమగుచున్నది. (పూలహారము మెడలో వేయుచున్నది.)

వెంక—(ఆశీర్వాదము) మేలు- మేలు- రాజులనోట గడ్డ ! బ్రాహ్మణుల పేరు నిలిపినావు. జయం- జయం- హ హ హ. (నవ్వుచున్నాఁడు.)

దుర్యో— అంగరాజ ! ఇట్టి యవమాన మెందైనఁ గలదా ? సమస్త భూచక్రము నేకచక్రాధిపత్యముక్రింద నేలుచున్న దుర్యోధనచక్రవర్తి యిట్టి పరాభవంబు సహింపఁగలఁడా ?

కర్ణుఁ—ద్రుపదుఁడు స్వయంవరమిషఁబెట్టి రాజుల నవమానించినాఁడు. ఈ బాఁపనయ్య మనల నిర్జించికదా కాంతనుఁ జేఁబట్టవలయు. వీని వధించెద. రాఁజులవరింపకున్న ద్రౌపది నగ్నిలోఁ బడవేతము.

ఉ. బాఁపఁడ ! పారిపోకనిలు ♦ భామనుగెల్చితినంచు గర్వివై
మూఁపునఁ గార్ముకంబిడి ప్ర ♦ మోదముఁజెందెదు కాంతదక్కునే?
కాపురమంపువాఁడ నిదె ♦ కాలుఁడు వాసముచేయు భూమికిన్
భూపతులుండ కే ? మగువఁ ♦ బోవగనిత్తురె భూసురాధమా ?

వెంక—సుబ్బావధానులు ! అంగవస్త్రం బుడిచెంబునకు కట్టు. తెగ వాగుచున్నాఁడు. సిద్ధం. బుడిచెంబుల యుద్ధం.

అర్జు—బ్రాహ్మణోత్తములారా ! శాంతింపుఁడు. నేనుండ మీకేల శ్రమ యేల ?

ఉ. బాఁడబులార ! నామనవిఁ ♦ బాలనఁ జేయుడు శాంతినొందరే !
వాడిశరంబులేసి రిపు ♦ వాహినిఁ గూల్చెద దేవదానవుల్
కూడిన, రాజసంఘములు ♦ కోటులు చేరినఁ గోటమీటనే !
వీఁడొక లక్ష్యమేమనకు వేడుకఁ ♦ జూపెద నిల్చియుండరే !

వెంక—తొండముదిరి పీసరవల్లియైనది. కర్ణుఁడే లెక్కలేదట. శహబాష్. శహబాష్. బ్రాహ్మణులపంట పండినది.

భీము—గీ. అంగవిభునకు మంగళ ♦ హారతెత్తి
పురికిఁ బంపుము శరములఁ ♦ బూవ జేసి
శల్యుశల్యముల్ పిండిగాఁ ♦ జమరి నేను
బంపుచున్నాఁడ రారాజు ♦ బలములడచి.

వెంక—పుల్లయ్యశాస్త్రీ ! బ్రాహ్మణులపుట్ట పగిలినది. వీఁడెవఁడు ? పులిమీఁదబుర్ర. ఆ. హా. హా. (నవ్వుచున్నాఁడు)

అర్జు—రాధేయ ! శూరుఁడవని గర్వింపకుము. మలోక్కదండ నిర్గత శరవిన్యాస మెఱింగెదవు గాక. (బాణములేయుచున్నాఁడు.)

కర్ణు—అబ్బా ! వీఁడి శర వేగము ! శరీరము తూట్లు పడుచున్నది. వీఁడు సామాన్య బ్రాహ్మణుఁడుకాఁడు. వాసవుఁడో ! వాసవపుత్రుఁడో కావలయు.

కృష్ణ—దుర్యోధనాది మహావీరులారా! బ్రాహ్మణులఁ బోషించుట క్షత్రియులకుఁ గర్తవ్యము.

వెంక—యంత్రము గొట్టినాఁడు. పసివాఁడు. సంతసింపకఁ జేతఁగాక పైఁగా నిక్కుచున్నారు. దేవాదిదేవుండవగు నో శ్రీకృష్ణ ! నీవు చెప్పుము.

కృష్ణ—భూసురులతోఁ గయ్యము సంపదలకు హానికరము. మాని మీ

పురబులకుఁ జనుడు. (అందరు నిష్క్రమింతురు. అర్జునునిఁ గృష్ణుఁ డు సమీపించి) బ్రాహ్మణవీరునకు శుభంబవుఁగాత. కళ్యాణీ! నీవు త్రిలోకవిక్రముఁ జేఁబట్టితివి.

అర్జు—త్రిలోకేశ్వరా!

గీ. నీవు! దయఁజూడఁ బెరగుట ♦ నీరజాక్ష!
యచ్చెరమె! లోకవంద్యిత! ♦ యమరవినుత!
కాంచినారము కన్నులఁ ♦ గలవుఁదీర
విమలతేజోనిధి వివేక ♦ వీర్యశరధి.

బల—మాయత్త కుంతి క్షేమమా?

అర్జు—బావలు మీదయయుండ క్షేమముగాక మరేమగును?

బ్రాహ—వీరు పాండవులు కారుకద? ఇతఁడర్జునుఁడా యేమి? మానసమా! వేగిరిఁబడకుము. త్రిలోకవిక్రమునిఁ జేఁబట్టితివని శ్రీమన్నారాయణుఁడు పలుకుచున్నాఁడు. కుంతీదేవి క్షేమము బలరాముఁ డడుగుచున్నాఁడు. బావలని వీఁరు వరుసఁ దెల్పుకొనిరి. వీరు పాండునందనులే. నేఁధన్యురాల - ధన్యురాల! ద్రుపదభూవిభుని ప్రయత్నము ఫలించినది.

కృష్ణు—పాంచాలవిభుని దర్శించి పరిణయంబై యిందుఁ గొంతకాలముండుఁడు. మేముపోయి వచ్చెదము. (నిష్క్రమింతురు.)

తరంగము పూర్తి.

## మొదటి యంకము — పాండవ రంగము.

ఇంద్రప్రస్థపురంబున శ్రీకృష్ణనివసిది.

[శ్రీకృష్ణుఁడు, రుక్మిణి, సత్య, ద్రౌపది ప్రవేశము]

కృష్ణ— కీ ర్త న.

1. పర ధన వనితా - సంగ విహీన
మాన్యులు - ధన్యులు - గారె జగాన॥ పర॥
2. ధర్మమె - చేయన్ - గలుగు సుఖాళి
వేరుగఁ జెప్పన్ - యేల బుధాళి॥ పర॥
3. కనుగొన లేదే - సురముని సమునిన్
ధర్మసూతిన్ - గెలువఁడె రిపులన్॥ పర॥

గనుక!—

గీ. కష్టములకోర్చి ధర్మముఁ ♦ గాచు రేనిఁ
గాచుధర్మము నిమ్ములఁ ♦ గాతలార!
ధర్మదేవత యనఁదగు ♦ ధర్మజుండె
తగిన తార్కాణమిందుకుఁ ♦ దరుణులార!

లేకున్న విషాగ్ని జలంబులఁబడి బ్రతుకువారు కలరా?

ద్రౌప—అన్నా! శ్రీకృష్ణ!

గీ. ధర్మసంస్థాపనార్థముఁ ♦ దనువుఁ దాల్చు
నీప్రసాదము లేకున్న ♦ నీలవర్ణ!
నడుచునా? జగము- విభుఁడు ♦ నడుపుఁగాక-
పురుషుఁ డేమి చేయఁ గలఁడు ♦ పూనికలను?

సత్య—మారజనక! శిష్టులఁ బోషింప, దుష్టుల సంహారింపఁ గంకణముఁ గట్టుకొంటివి. ధర్మ మేల నడువకుండు.

రుక్మి—ఆదిదేవుఁడవు- సర్వేశ్వరుఁడవు- సర్వసముఁడవు. నీకు వారు వీరనుఁ దారతమ్యము లున్నవా.

[హరిదాసు ప్రవేశము]

హరి — కీర్తన.

1. సురాళి సేవిత - పురారి వందిత - సురాసురాఖిల పావనా
రమారమణ మది - సదా నమ్మితి - పరాకేల ఫణిమర్దనా॥ సురా॥
2. విరాళిఁ జెందిన - సరోజనేత్రల - బరామర్శ నీవుఁ జేయవా
విరోధులకు దండు - మహాపదంబు - నిరాటంకముగ నివ్వవా॥ సు॥
3. నరుండవో మఱి - హరుండవో యఘ - హరుండవో యననేల
పరాత్పరుండవు - పరంధాముఁడవు - పరాకేల మము బ్రోన॥ సు॥

పరమేశ! సృష్టికి మొదటివాఁడవే నీవు! సృష్టిలో మాతోఁ గష్టపడువాఁడవు నీవే. కనఁబడుచున్న నీవెలిఖద్యోంబంతయు నీవు కావ? నీవిందుఁ జొరఁబడుటచేఁగదా మాబోటివారికి నీదర్శన మబ్బుట. సర్వేశా! ఈబ్రహ్మాండమందలి సర్వపదార్థములు నీవై యుండ, మేము నేటిచే నిన్నుఁ దృష్టిఁ జేయఁగలము. భక్తితోఁ బెట్టిన ఫలపత్రంబులు నీకుఁ బరమాన్నంబట. తృణతోయంబులు మధుతుల్యంబట. ఈచెఱుకుముక్కను స్వీకరించి నన్ను ధన్యునిఁ జేయుము.

(కృష్ణుఁడు చెఱుకుముక్కను బుచ్చుకొని)

గీ. విష్ణుగాథలఁ జెవులార ♦ వినెడివారు,
విష్ణుఁబూజించి మది విఙ్ఞ ♦ వీఁగువారు,
విష్ణుసేవల ఁపదినిల్పి ♦ వేఁడువారు,
వారె యాప్తులు బంధులు ♦ వారెనాకు.

(హరిదాసు పాడుచుపోవును.)

కృష్ణు—పరమభాగవతోత్తముని బ్రసాదము మనమందర మారగింత మా? (కోయఁబోయిన వ్రేలుతెగి రక్తముకారును.)

సత్య—అయ్యో! అయ్యో!

రుక్మి—తడిగుడ్డ! తడిగుడ్డ! (అందరు నటునిటు వెతకుదురు.)

ద్రౌప — ఏమిర క్త ప్రవాహము ? (తన విలువగల చీరచెఱఁగుఁజించి కృష్ణుని వ్రేలఁ జుట్టుచున్నది.)

సత్య — ఏ ోడంబమొ !

రుక్మి — ఏమి తెగువ !

కృష్ణు — ద్రౌపదీ ! ఏమి నీనిశ్చలభక్తి ! నీకు వలువలక్షయములగుఁ గాక.

గీ. తనదియనుమాట లేకయే ♦ తన్నుమరచి
యర్పణంబుగఁ జేసిన ♦ యాదరంబె
ముఖ్యమై ముంగల సమకూర్చు ♦ ముక్తిపదవి
వెనుకముందాడు వారిని ♦ విడువదఘము.

ద్రౌప — అన్నా ! బాధ శమించినదా ?

కృష్ణు — అమ్మా ! సోదరీ ! పరమపవిత్రమగు నీస్పర్శ శమింపఁ జేయకుండునా ? (కంచుకి ప్రవేశము.)

కంచు — కంసమర్దనా ! గోవర్ధనోద్ధారణ ! రాజసూయమంటపంబునఁ బాండవులు సకలమిత్ర బంధుసమేతముగ దేవరరాకకై యెదురుచూచుచున్నారు. వేగిరఁబడవలయు.

కృష్ణు — మగువలారా ! మరచితిమి ! పోదమురండు.

(నిష్క్రమింతురు.)

రంగము పూర్తి.

## మొదటి యంకము—నాల్గవ రంగము.

### పాండవుల మందిరాంగణము.

[దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, ద్రౌపది ప్రవేశము]

దుర్యో — అనుజా ! దుశ్శాసన ! ఏమి యీయింద్రప్రస్థపురము ?

సీ. ఘనకవాటశ్రేణి ♦ గాన్పించుఁ జొరఁబోవఁ
గుడ్యమై ముఖమునఁ ♦ దొట్టుకొనెను

రాజమార్గంబని ♦ రభసంబుతో నేగ
బంకమై పాదముల్ ♦ పట్టుకొనెను.
ఉన్నతస్థలమని ♦ యుబికి నారోహింపఁ
గరమై గాత్రముం ♦ గాయపరచె
సమదేశమని చాల ♦ సంరంభగతిఁ బోవ
సలిలమై వస్త్రముల్ ♦ సగముఁదడిపె
గీ. అహహా ! మయుని మాయావాగు ♦ రాళ్ళఁద్రోసి
పరిభవించితివే మమ్ముఁ ♦ బాండుసుతుఁడ !
కాని కానిలే ! చూతువు ♦ గాఢ ఫలము
కండకావర మడగింతుఁ ♦ గఠినకర్మ !

దుశ్శా—మన శకునిమామతో యోచింతము. అదుగో పాంచాలి! కలసుకొందమా ?

(దుర్యోధనుఁడు గోడవైపునకు వస్త్రము పైకెత్తుకొనినడువ)

ద్రౌప—(పరిహాసముతో) బావగారు! ఇటు. ఇటు. గోడపైఁబడకుడు! వసనంబు జారవిఁడువుఁడు. నీరములు కావవి. ఇంద్రనీలమణిఖచిత రాజమార్గంబులు.

(దుర్యోధనుఁడు తలవంకించును.)

దుశ్శా—దీని ఫలమనుభవింపకమానదు.

గీ. చక్రవర్తి యీతండని ♦ శంకలేక
మేలమాడుచునున్నది ♦ మిండకత్తెఁ
బోలె పాంచాలి ! సభ దీని ♦ పొగరడంచి
పరిభవింపక నుంటిమా ♦ పలుచదనము.

(నిష్క్రమింతురు.)

రంగము పూర్తి.

## మొదటి యంకము — అయిదవ రంగము.

### రాజసూయమంటపము.

[పాండవులు, భీష్ముఁడు, శిశుపాలుఁడు, కృష్ణుఁడు ప్రవేశము.]

ధర్మ — గీ. సమరభోజను వాక్యాను ♦ సరణిఁ బూని
యింద్రునకు మెప్పు వాటిల్ల ♦ నేకదీక్ష
రాజసూయాఖ్య సవనంబు ♦ రహినొనర్చి
కృతకృతార్థుండ నైతి శ్రీ ♦ కృష్ణుఁగరుణ.

పితామహా ! సురగురునిమించు భూసురశ్రేష్ఠులు క్షత్రియపుంగవులు వచ్చియున్నారు. అర్ఘ్యమందుటకు వీరిలో నరుహులెవరో చెప్పి మమ్ము ధన్యులఁ జేయుము.

భీష్ముఁడు — కుమారా !

సీ. ఆదియంత్యములేక ♦ యలనాఁడు నీటిలోఁ
బత్రంబుపై నున్న ♦ బాలకుండు
మత్స్యమై సోమకు ♦ మందిరంబునఁ జొచ్చి
వేదముల్ తెచ్చిన ♦ వీరవరుఁడు
కూర్మమై వీపునఁ ♦ గొండరాపిడికోర్చి
యమృతంబుదర్చిన ♦ యధికబలుఁడు
క్రోడమై కోరను ♦ కుంభినిఁ దాల్చుకఁ
గ్రూరుహిరణ్యాక్షుఁ ♦ గూల్చినకిరి
నరసింహమై దాకి ♦ నరభోజనుని జీల్చి
బాలకుఁ గాచిన ♦ ప్రబలశక్తి
పొట్టియై బలిఁదాకి ♦ పురుహూతు నేలిన
వీరాధివీర త్రి ♦ విక్రముండు
బాపఁడై పరశుచేఁ ♦ బలుమారు రాఁజులఁ
ద్రుళ్లఁగించిన ♦ దొడ్డశెట్టి

రాముఁడై దశరథ ♦ రాముఁడై రావణు
సంహరించిన మహా ♦ సత్త్వయుతుఁడు

గీ. నేఁడు నీయింట బంధువై ♦ నెచ్చెలియయి
బావమఱఁదియై నేతయై ♦ పద్మలోచ
నుండు కృష్ణాఖ్యనున్నాఁడు ♦ నూరుదోర్లఁ
జూడ నేటికి నితనికి ♦ జోఁడుగలరె?

శ్రీమన్నారాయణుఁడు నీయెదుటఁ గృష్ణరూపమునఁ బ్రత్యక్షమై యున్నాఁడు. అతని కర్ఘ్యమర్పించి కృతార్థుఁడవుకమ్ము.

ధర్మ—

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు♦దాతయునై నము మోక్షదాతయున్
ఫుల్లసరోజనేత్ర! పరి ♦ పూర్ణదయాసిధి! బావ వంచు మా
యుల్లమునందు నమ్మితిమి ♦ యోసుగుణాఢ్య సురారిజైత్ర యో
వల్లవకామినీవరవి ♦ శారద యర్ఘ్యము నందవే దయన్.

(కృష్ణున కర్ఘ్యమిచ్చుచున్నాఁడు)

శిశుపాలుఁడు— ఔరా! భీష్మ!

చ. ముదిమినిఁ బాటితప్పి ముని ♦ ముఖ్యుని వేషముఁదాల్చినట్టి కో
విదుఁడను, ధర్మసూత్రముల ♦ వింటివి గొన్నిటినంచుఁ బెద్దవె
సదమలచిత్తు లార్యకురు ♦ సత్తము లెందఱో కూడియుండ బల్
వదరెదు, భీష్మ! కృష్ణుని గ♦వాటపుకావలి బంటుబంటవై.

భీష్మ— శిశుపాల! ధర్మతనూభవుఁడు ధర్మముఁదెలుప మనఁగా నీరజనాభునిపై మదినిలిపి యాతఁడే ధర్మముఁదోపఁజేసెనో యాధర్మము దాచకఁ బలికితిమి. మముఁ గారులుప్రేలుచుఁ దిట్ట ధర్మమా?

శిశు— అబ్బో! ఏమి నిర్లిప్తత! ఇంటి పెద్దవు నీవగుటచే ధర్మజుఁడు నిన్నడుగనౌను. గంగానందనా! వీరు నీపాటి విదులు కారా? వెఱులా? చేతఁగాకఁగూర్చుండిరా? నీవే ధర్మజ్ఞుండ వనుకొంటివా? ఒహో! ఏమిధర్మము! ఇది కృష్ణోపదిష్టధర్మము కాఁబోలు!

ధర్మ— చేదినాథ!

చ. విను, కురువృద్ధు లీయసుర ♦ వీరకృశానులు నాదిదేవుగా
ననిశము వేనవేవిధము ♦ లాస్తికబుద్ధి వచింపరే! సనా
తననిగమాగసూదులు సదా వినుతింపవె? యాదికారణం
బని, యలుకేలఁ? జైద్య! యిఁక ♦ నర్ఘ్యమునందుట కెవ్వరర్హులే?

శిశు—ధర్మజా! ధార్మికులకెల్ల ధర్మజుఁడు కడుఁ బెద్ద యని భయవి
రహితులై బాంధవులు వచ్చినారు. వారిని వంచించి వల్లవున కర్ఘ్య
మిచ్చితివి.

భీము—

శా. రంకెల్ మానుము భీష్మ ద్రోణ కృపు లే ♦ రాజీవనేత్రుండు ని
శ్శంకం బూజకు నర్హుఁడంచుఁ దెలుపన్ ♦ సామోదియై యిచ్చె నా
టంకం బేల? వృకోదరాహ్వయము శుం♦డాలంబు కోపించి యీ
వంకన్ దాకి గదాప్రహారముల నీ ♦ వాగ్వాదము న్మాపదే?

భీష్మ—(భీముని వారించి) మారుతాత్మజా! వీనితల్లి సాత్వతి తొల్లి
నల్లవాని వేఁడ నూరుతప్పుల సైరింతు నని వర మొసంగె. దాని మ
హిమను బ్రతికెఁ గాక. కృష్ణుని దూషించి భీష్ముని నెదిరించి బ్రతు
కఁగలఁడా?

సహ—సాత్వతేయ! పరబలమున నోటికివచ్చినట్లు ప్రేలెదవేల? యో
ధాగ్రగణ్యు లసమానధనుర్ధరులు రణరంగశూరులు కౌరవేయులు
నీపాటి క్షాత్ర మెరుంగరా? సకలధర్మార్థవేత్తలు భీష్మాదులు వ్య
ర్థప్రలాపులా? నీవే యున్నింటఁ గడఁదేరిన మొనగాఁడ వని తలచి
తివా? ఓ, యోధవీరులార! సభాసదులార! మీ రుపేక్ష జేసిన నీ
పాండవసింహకిశోర మూరకుండునా? ఈశిశుపాలుఁడే కాదు, వీని
యభిప్రాయముతో నేకీభవించినవా రెందఱైన నన్నెదుర్కొనుడు.
అందఱ మట్టుపెట్టి యర్ఘ్యప్రగృహీతకు, శ్రీకృష్ణభగవానునకు విం
దు చేసెద.

భీష్మ—తండ్రీ! సమయముకాదూరకుండుము. సర్వసంహారకర్త
శ్రీకృష్ణుఁడు.

శిశు—కృష్ణా ! నీవే శూరుఁడవు నేర్పరివి యనుకొనుచుంటివా ? వహ్వా ! ఏమి నీనేర్పులు. చీకిన బండికొయ్యనుఁ బడఁజిమ్మ నేర్తువు. నీటిపాముపైఁ ద్రొక్క నేర్తువు. పాలిచ్చుటకు వచ్చినభామను నిర్దయఁ జంపనేర్తువు. ముంగిటనున్న చెట్టుచేమలఁ బడఁగొట్టనేర్తువు. నీకు, శూరాగ్రగణ్యులమగు మాతోఁ బోల్కె కూడనా ?

సీ. కుల గోత్ర ధర్మముల్ • కూలఁగాఁ బశువుల
మందకాపరులమై • మసలఁగలమె ?
యజ్ఞయాగావళి • యడుగంట బాఁపల
కోడండ్రకూడులఁ • గుడువఁగలమె ?
మాయమర్మము లేని • మామను వంచించి
పెజ్జపై రాధను • జేర్చఁగలమె ?
పరకాంతలనుమాటఁ • బరిగణింపక మంచి
గోపకాంతలఁబట్టి • కూడఁగలమె ?
గీ. నగ్నమైయున్న సతులతోఁ • నవ్వఁగలమె ?
మిత్రికూళ్లను బొరుగిండ్ల • మెక్కఁగలమె ?
గొప్పచుట్టాలఁ గట్టించి • కొట్టఁగలమె ?
పరుఁడు వలచినకాంతఁ దేఁ • బారఁగలమె ?

కృష్ణు—చేదికులపాంసన !

గీ. స్వల్పరాజ్యమదాంధ గ•ర్వాన్వితుండ !
వదరఁబోకుము నోటికి • వచ్చినట్లు.
నీదుకడిమియు నీలావు • నీదుచేవ
నీప్రతాపము నెరుఁగనే • నేను చైద్య !

శిశు—నాది స్వల్పరాజ్యంబని నన్ను ధిక్షేపించుచుంటివా ?

సీ. రాజ్యపూజ్యత లేక • రారాఁజు లుండఁగఁ
దగుదు వమ్మా యని • తక్కలేదు
తినుట కన్నము లేకఁ • దెగువతో గొల్లల
కూటికుండలఁ జెయ్యిఁ • గూర్పలేదు

యిల్లువాకిలి లేక ♦ నేప్రొద్దు ధర్మజు
పంచలఁబట్టుకఁ ♦ బ్రాకలేదు
యూరునుంగడిలేక ♦ నుదకమధ్యంబునఁ
దోయజంబులరీతి ♦ దూరలేదు
గీ. కొంపయూ గోడయూ నీకు ♦ గోపబాల
వెన్న మీగడ మెక్కెడి ♦ వెన్నదొంగ
చల్లకుండలు మోసెదు ♦ గొల్లదొరకు
రాజ్యహీనున కేటికి ♦ రాఁజకీవి ?

భీష్మ—సాత్వతేయ ! నీవు కోరినకాంతను నీయెదుట నీలవర్ణుఁ డెత్తుకొని పోవునపుడు నీవెక్కడుంటివి ? నీప్రకర్షయేమాయె ? నీరజాక్షుని నిందింప నీకుఁ దగునా ?

శిశు—భీష్మా ! నీబోటి ముసళ్లు భట్టులవలెఁ బొగడుచుండుటచే నీ కృష్ణుఁడు తానొక మొనగాఁడనని విఱ్ఱవీగుచున్నాఁడు. ఓరీ ! కృష్ణహతక !

సీ. ఇంద్రజాలముతోడ ♦ నెనయైన నీమాయ
సర్వేశు మహిమకు ♦ సాటియనిరి
గొల్లపిల్లలతోటి ♦ కోతికొమ్మంచులు
లాలిత లీలావి ♦ లాసమనిరి
గోపకాంతలఁగూడి ♦ కూసినకూతలు
వేణునాదవినోద ♦ విభవమనిరి
కాల్చియార్చినకట్ట ♦ కడిమిమించినకాంతి
నీలమేఘపుడాలు ♦ నెగడుననిరి
గీ. నీదురంకులు బొంకులు ♦ నీవినీతి
మాయమందులు మంత్రముల్ ♦ మహిమలంచు
వేయివిధములఁ గొందఱు ♦ వేఁడవేఁడ
విఱ్ఱవీగెదె నిజమని ♦ వెఱ్ఱిగొల్ల.

ధర్మ—చేదికులసంభవ ! శ్రీకృష్ణుని సామాన్యునిఁగాఁ దలంపకు. దేవ

దానవుల కజేయుఁడు ద్రిలోకవిక్రముఁడు. సకలరాక్షససంహారదీక్షా
పరుఁడు. దూషించి దోషంబు వడిఁగట్టుకొనుచుంటివే ?

శిశు—రాక్షససంహారమా ! ఏరాక్షసుఁడు వీనిచే మాఖాముఖి వధింపఁ
బడెనో !-భీష్మా ! నీకోటిముదివెఱ్ఱుల కీతఁడు దేవుఁడే !

సీ. జలకమాఁడుచు నున్న ♦ జవరాండ్ర వలువలు
దెచ్చి మూసెక్కఁగ ♦ దేవుఁడితఁడు
వల్లవకాంతలఁ ♦ వలపించి రతికేళిఁ
దేలియానందింప ♦ దేవుఁడితఁడు
ఇంటింటఁ బాల్పెరుఁ ♦ గిచ్చవచ్చినరీతి
తెగఁదిని మెస్పెంచ ♦ దేవుఁడితఁడు
పెల్లిపీటలమీఁది ♦ పెల్లికూతులఁదెచ్చి
తెంపునఁ బెండ్లాడ ♦ దేవుఁడితఁడు
గీ. తలలుమార్చను ముడిఁబెట్టఁ ♦ దంపిఁబెట్టఁ
దిట్ట దీవింపఁ దినఁ దిన్ను ♦ దేవుఁడితఁడు
రంకుబోతుల దూత ల ♦ ర్పణలుసేయు
దివ్యహారతు లందఁగా ♦ దేవుఁడితఁడు.

కృష్ణు—ఓరీ ! క్షీణకర్మ !

సీ. ప్రాగోతిషంబున ♦ రణమునలో మేముండ
దహనుని ద్వారకఁ ♦ దాపినావు
మత్తిల్లి రైవత ♦ మహీరథంబునవేడ్క
మసలెడి భోజుల ♦ మాపినావు
యార్భాటమున నాఁడు ♦ హయమును బంధించి
చెనటి ! యాగముఁ బాడు ♦ చేసినావు
కల్పించి కయ్యము ♦ గాలదువ్వి సభనన్ను
నోటవచ్చినరీతి ♦ నుడివినావు
గీ. మున్ను నేనొసగిన వర ♦ మునకునోడి
కాచితి నపరాధశతము ♦ గరుణఁబూని

కాచుకో రోరి ! కలుషాత్మ! • కాచుకొ మ్మ
వచ్చెనిదుగో చక్రంబు సి • రవ్యక్రగతిని.
(చక్రముచే శిశుపాలుఁడు తలఁ దెగి పడుచున్నాఁడు.)

రంగము పూ ర్తి.

## మొదటి యంకము — ఆరవ రంగము.

కౌరవుల సభామంటపము.

ధృతరాష్ట్రుఁడు—తనయా !

గీ. భీష్మవాక్య సమ్మేళన • బీరుపుచ్చి
ద్రోణకృపులాడు మాటలఁ • ద్రోసికడకుఁ
దుడువరప్పించి బంధులఁ • గొలువుఁజేర్చి
జూదమాడుట న్యాయమా ? • సోదరులతో.

అర్జు—ఎంతకష్ట మెంతకష్టము. మాయమర్మము లెఱుగని మాయన్న శకుని మాయలోఁజిక్కి సకలమోడుచున్నాఁడు. నీలవర్ణా ! కంసమర్దనా ! కలుషహరణా ! శ్రీకృష్ణా ! నీవేగతి.

దుర్యోధనుఁడు—ధర్మజా ! యూరకున్నావేమి ?

ధర్మ—సకలమొడ్డితిని. ఇంకేమున్నది ?

శకుని—చెప్పవలెనా ? లేదా పాంచాలి ?

భీముఁడు—ఓరోరి మదగర్వదూషితమతి ! ఖలా ! సారాసార వివేకశూన్యా ! పాండవధర్మపత్నిని యొడ్డమనుచుంటివా ? ఈగాండీవి ! యీభీముఁడు నీయార్భాటముల సైతురా ?

అర్జు—గీ. పాండవుల్ స్వరాజ్యవ్రతము • పట్టినారు
తోఁడు వారికి దైవంబు • దొడ్డదొర న

నిబలు విఱ్ఱవీగవలదు ♦ నీచ ! యింక
నీనిరంకుశత్వమునకు ♦ నిండుసున్న.

ధర్మ—నన్నే పణముగా నొడ్డితిని.

శకు—పాంచాలియను ధనములేదా ?

సహ—ఓరా ! శకుని మాయావాగురుల కంతమున్నదా ? సకలకౌరవ వీర సమక్షమున మిన్నమున్నుఁగానక, ధర్మాధర్మ జ్ఞానశూన్యుఁడై పాంచాలి నొడ్డమనుచున్నాఁడు. వీనినాలుక వెయ్యిచీలికె లొనరించి శిరమొక్క వ్రేటున దుండెతుండెము లొనరింపకున్న వీనివాగుడు కట్టుపడదు. అన్నగారికిఁ గోపమువచ్చునని యూరుకొనవలసి వచ్చె. ఏమిచేయను ?

ధృతరాష్ట్రుఁడు—

మ. కురువృద్ధుల్ గుమిఁగూడియుండఁదనయా! ♦ కూర్చుండరప్పించి యీ
సరణిన్ జూదమునన్ బన్ని గెల్వఁదగునా? ♦ సర్వస్వమున్ న్యాయమే !
వరతేజోనిధు లీవృకోదరసరుల్ ♦ వారింపఁగా శక్యమే
తరమే ధర్మజు నాపఁగా విడిపడన్ ♦ ధాత్రీస్థలిన్ బుత్రకా!

భీష్ముఁడు—దుర్యోధనా ! ఈదుర్వ్యవసాయము విడువుము. స్త్రీల మానము గాపాడుము.

సీ. సీతకై రాముఁడు ♦ చెనటిరక్కసుఁగూల్చె
కులతల మర్యాద ♦ నిలుపుకొఱకె
పార్వతికై శూలి ♦ పద్మజుతలఁగొట్టెఁ
బతివ్రతామణులఁ గా ♦ పాడుకొఱకె
ఇంద్రాణికై ఋషు ♦ లిల్లఁదిట్టిరినృపు
మగువల మానంబు ♦ మనుపుకొఱకె
ఖలుజరాసంధుని ♦ ఖండించెభీముఁడు
పడతుల బందీలఁ ♦ బాపుకొఱకె

గీ. భారతీయుల కిది ముఖ్య ♦ కార్యమగుట
క్షాత్రధర్మముఁ బనిఁబూని ♦ కావవలయు

చెడకురా కట్టుచెలులకుఁ ♦ జెరలుపన్న
ఫలముకలదె నిరంకుశ ♦ ప్రభుఁడనంగ.

విదురుఁడు—మాయాజూదముబన్ని వీరిసర్వస్వము గెలుచుకొంటివి. అది చాలకఁ గూళవై వీరిధర్మపత్ని నపహరించెదవా? ధర్మము నకుఁ గట్టుపడిరి గాక. లేకున్న నేమిప్రళయము బుట్టియుండునో.

దుర్యో—చాలు- చాలు- ఊరకొనుము. నిన్నుఁబెద్దవని తగవు జెప్ప మంటిమా? పాండవులు నీకు గురువులు. పక్షపాతబుద్ధివై వారి బంటుపగిది వారినిబోలిన ఖోటుబంటు లవని లేరని తెగఁ బ్రేలవలదు.

శకు—ద్రుపదరాజనందన నీసొత్తుకాదా? ఒడ్డవేమి?

ధర్మ—మొదట నన్నొడ్డితిని.

శకు—ఓడితివి.

ధర్మ—ద్రౌపదినొడ్డితిని.

శకు—ఓడితివి - సుయోధనచక్రవర్తీ! పాండవులు పాంచాలిసహిత ముగ నీకుదాసులు.

దుర్యో—మామా! నీప్రజ్ఞ కడ్డుకలదా!

కర్ణుఁడు—దుర్యోధనమహారాజా! దాసియగు పాంచాలిచే మొదటఁ బనిపుచ్చుకొనుము.

దుర్యో—తమ్ముఁడా! దుశ్శాసన! అంతఃపురమున కరిగి ద్రౌపదినిటకు రావింపుము.

దుశ్శా—మహాప్రసాదము. (స్వగతము)

చ. మయుసభ మేముపొందు నవ ♦ మానముఁ గాంచి విశంకనవ్వవే
భయమనుమాటలేకఁ గుల ♦ భామల కీవిధిమంచిదానె నిన్
రయమునసీడ్చి తెచ్చి కురు♦ రాజుల మధ్యను గొప్పుబట్టెదన్
దయగల నీమగండెవఁడు ♦ దాకునొ యడ్డము జూతుభామినీ!
(పోవుచున్నాఁడు)

భీము—

ఉ. పాండవధర్మపత్ని కుల♦పావని నీరద నీలవేణివే

దండసమానయానద్రుప • దాధిపుగాదిలిపట్టి ద్రౌపదిన్
కొండలవంటి పాండవులు • కొల్వునఁ జూచుచు నుండియుండఁగా
దుండతనంబుతో సభకుఁ • దోడ్కొనిరమ్మని పంచె నక్కటా.

(దుశ్శాసనుఁడు ద్రౌపదిని దలఁబట్టి యీడ్చుకవచ్చును.)

ద్రౌపది—

ఉ. ధార్మికులెవ్వరి మత్పతులు • ధర్మముచేఁ గడుబద్ధులైరె యో
నిర్మలతేజులార! యవి • నీతిని సైతురె; భారతీయులీ
కర్మప్రధానమౌ భరత • ఖండమునన్ విభవత్వ మబ్బెనే
ధర్మమునిల్పు వీరసుత • తండము జచ్చెనె దేశమాతకున్.

సీ. పరశురాముని ఫాటిఁ • బరిగణింపనిమేటి
భీష్ముని తేజంబు • తీరువడెనె?
ఖాండవవనమెల్లఁ • గాల్చిన వీరుఁడు
పార్థుని క్షాత్రము • పలుచఁబడెనె?
బక జరాసంధుల • బలిమిఁ గూల్చిన జెట్టి
భీమునిదర్పంబు • బిగువుచెడెనె?
కురువృద్ధవీరులు • కొలువు జేరినచోట
ఘోరంబు జరుగునా • కులసతులకుఁ

గీ. గూళవీఁడు నన్నీడ్చెనా • కొప్పుఁబట్టి
ఖలుడుఁ రాజైనఁ బ్రజలకు • గలవు సుఖము
కురుకులంబులు మొదలంటఁ • గూలు నవని
భరతభూమిని ధర్మము • బ్రబలునెట్లు?

భీష్మ ద్రోణ కృపులు నోటికిఁ దాళము వేసుకొనిరి. మత్పతులు మంత్రబద్ధములగు సర్పంబులరీతి గట్టనడిరి. కురువృద్ధుఁడగు ధృతరాష్ట్రుఁడు పుత్రవాత్సల్యముచే నోరుఁగదుపకున్నాఁడు. దుష్టచతుష్టయము జెలరేగె. చేయునదేమి?

దుర్యో— దాసీ! వదరఁబోకుము. ధర్మసుతుఁడు జూదమున నిన్నుఁ దమ్ములఁదన్నునోడె.

ద్రౌపది—మాయారాజూద ప్రవీణా! నిజముబలుకుము. ధర్మసూనుండు ధర్మముం దప్పండు. మొదటనన్నోడెనా? లేకం దన్నోడి నన్నోడెనా?

(అందఱూరకుందురు)

వికర్ణుం—పాంచాలి సభలో ధర్మప్రశ్నంబుచేయుచున్నది. పెద్దలందఱు పలుకకున్నారు. తెలిసితెలుపకున్నం దీవ్రమగు నరకకూపమునంబడి నలుగనలయు. ఆర్యులారా! గద్దెలపైనెక్కి కూర్చుండుటయా సభ్యులధర్మము. కౌరవవీరులారా! ఏంలపలుకరు? ఏంలపలుకరు? ధర్మసందేహమడిగినం దగినచర్చంజేసి సత్యము దేటతెల్లముగాంజెప్పవలయు. మీరూరకున్న నాకుందోచిన ధర్మసూక్ష్మమెఱింగించెద వినుండు.

గీ. భర్తలైదుగు రీమెకుం ♦ బందెమేసి
యొకనొకనికి సాధ్యమై ♦ యొప్పదరయ
దాసి యనరాదు పాంచాలి ♦ ధన్యురాలు
పరమపావని బతివ్రత ♦ భవ్య చరిత.

సభకు రావించుటేతప్పు. రావించి పరిభవించుట మఱియొకతప్పు. వేణింబట్టి యీడ్పుమాటేం జెప్పవలెనా?

కర్ణ—బాలుండవగుటచే నిజమెఱుగకున్నావు. అయిదుగురికిల్లాలు. పతివ్రతయెట్లగును. బంధకి. పరిభవించిన దప్పేమి?

వికర్ణుండు—అమ్మా! పాండవపత్నీ! నీపవిత్రత నిన్నుం గాపాడకమానదు. వీరందఱు మహాపెద్దలు. ఇందుండజాల. ఈఘోరము జూడంజాల. పోయెదను.

ద్రౌపది—వికర్ణుండు బాలుండయ్యు బుద్ధిని బృహస్పతిని మించె.

అశ్వత్థామ—వికర్ణా! నీవేధార్మికుండవు? నీవేయార్యుండవు!

కర్ణుండు—వికర్ణుని మాటకేమి! సకల ధర్మజ్ఞానస్వరూపులగు బ్రాహ్మణోత్తములు తామో?

అశ్వ—ఓరీ! సూతపుత్ర! నీకు బ్రాహ్మణద్వేష మపారము. మహారాజు యొద్దంజేరి మంత్రిపదవి నలంకరించితినని విఱ్ఱవీగకుము. నీవెం

త నీమంత్రిపదవి యెంత. బ్రాహ్మణుల గోటఁ జిమ్ముచున్నావు. వారె తుదకు నీకు బుద్ధిచెప్పువారు.

కర్ణు—ఓరీ! ద్రోణాయని! మిత్రుకూటికిఁ జేరిన బాపనయ్యకీ నిక్కులేల!

గీ. మేనఁ బులితోలుదాల్చిన ♦ మేక మొకము
కాఁదు. శస్త్రముల్ మేనెల్లఁ ♦ గట్టుకొన్న
క్షత్రియుండౌనె బ్రాహ్మణ ♦ శ్వాన మెందు
మించె సంభావనకువేళ ♦ మేతవేళ.

హాహాహ్మ.

అశ్వ—ఓరీ! శూద్రహతక!

గీ. మొదటినుండియు ధర్మము ♦ మొక్కబోక
నిల్పువారలె బాఁపలు ♦ నిజము భరత
భూమి భూసురులకు సొమ్ము ♦ పొగరుబోత!
పంద! యేమిచేసెదో వారిఁ ♦ బారఁదోలి.

ద్రౌపది—నేనేకవస్త్రను. సభకురావింపఁ దగునా?

కర్ణు—పదుగురి కిల్లాలగు మహాపతివ్రత- ఏకవస్త్రయట. విగత వస్త్ర కాఁదు కద?

దుర్యో—విగతవస్త్రను జేయమనియూ నీయభిప్రాయము. (ద్రౌపదిని సమీపించి వణుకు చుండును.)

ద్రౌప—సీ. శరణన్నఁ బగవాని ♦ సహజన్నుఁ గాచిన
దాక్షిణ్య భావము ♦ దాచనగునె?
కావు కావు! మటన్న ♦ గరి మొఱయాలించి
మకరి దుమ్మించిన మంచి ♦ మరువనగునె?
శబరిమెంగిలి తిని ♦ సంతుష్టిఁ జెందిన
సమరసభావంబుఁ ♦ జంపనగునె?
స్థంభము వెలువడి ♦ డింభకు బ్రోచిన
విపులతేజోరాసి ♦ విడువనగునె?

గీ. పాండవులపత్ని ! పాంచాలి ! ♦ పాపరహిత
ద్రుపదతనుజ నీ సోదరి ♦ దుష్ట జనుల
మధ్యఁ జిక్కె నో కంజాక్ష ♦ మధువిరోధి !
కావవే కృష్ణ ! కంసారి ! ♦ ఖలవిదారి !

అశ్వ—మహారాజుగారగ్నిహోత్రముపై నురుకఁబోవు మిడతవలె నున్నారు. పాంచాలీ ! నీపవిత్రతకు శస్త్రాస్త్రములు సరిగావు.

దుర్యో—అబ్బా ! ఏమి యీామె మహాత్మ్యము. (కూలఁబడి) దేహము కంపమెత్తుచున్నది. ప్రాణమే లోనికీడ్చుకొని పోవుచున్నది. పాతి వ్రత్యమహాత్మ్యము నేఁడు కదా తెలియవచ్చినది. అకలంక పవిత్ర చరిత్రలగు పతివ్రతామ తల్లులుండుటచేతనే యీావసుంధర ధన్యతఁ గాంచుచున్నది. అయిదుగురి కిల్లాలగుటచే నీపాంచాలి బంధకి యని తలచుచుంటిఁ గాని పరమపతివ్రత యనుటకు సంశయములేదు. అయిననేమి ? చతుస్సముద్రమేఖలావనీపతికి, దుర్యోధన రాజాధిరాజునకుఁ బతివ్రతలు, గితివ్రతలు- నానిరంకుశత్వమునకు నిరోధమా ? తమ్ముఁడా ! దుశ్శాసన ! శేషము నీవుముగింపుము.

దుశ్శా—(ద్రౌపదిని సమీపించి వణుకుచుండ)

ద్రౌపది—సీ. ఇదికదా శ్రీకృష్ణ ! ♦ యిందీవ రాక్షుల
మానముగాపాడ ♦ మంచివేళ
ఇదికదా నాయన్న ! ♦ యేప్రురుమజదుల
మర్యాదచెడకుండ ♦ మనుచువేళ
ఇదికదా గోపాల ! ♦ యిహపర సౌఖ్యముల్
పోకుండఁ గావగాఁ ♦ బూనువేళ
ఇదికదాపుణ్యాత్మ ♦ యేదిక్కులేనట్టి
క్షత్రియకాంతను ♦ గాచువేళ

గీ. ఏమితోచదు దిక్కేది ? ♦ ఏమి తెరువు?
ఏఁడనుంటివో నామొఱ ♦ యేలవినవో !
నందనందన గోవింద ♦ నాకవంద్య

విగతవస్త్రనుఁ గావింప • వీడు బూనె.

(దుశ్శాసనుఁడు చెఱగుఁబట్టి లాగుచున్నాఁడు)

కృష్ణు—పాంచాలీ! అక్షయ మక్షయము.

(దుశ్శాసనుఁడు కూలఁబడి)

దుశ్శా—చేతులు నొప్పులెత్తుచున్నవి. ఏమియీచిత్రము? చేలములు గుట్టగుట్టలెపడుచున్నవి. విప్పుటనాతరమా? ఈమె మహాత్మ్య మపారము. ఈమెను సరిపోలినవారు కానరారు.

భీము—

ఉ. సామజయాన ద్రౌపది; వి • శాల విలోచనఁ బట్టియీడ్చినాఁ
డేమదగర్వినాని యుర • మేసి గదాహతివేడి రక్తమున్
సోమముభాతిఁ బీల్తునని • శూరులుమెచ్చఁగఁ గీర్తిహెచ్చమా
రామవిలాసమొందఁ గురు • రాజపుడొద్దనె నిల్చిచూడఁగా.

దుర్యో—ఈపాండవపశువు తెగవాగుచున్నాఁడు. వీడు కేవలము మోటుపసరము. ఇప్పుడు ద్రౌపదిని నాతొడపైఁ గూర్చుండమని సైగఁ జేసెద. ఈభీముఁడేమిచేయునో చూతము.

(దుర్యోధనుఁడు తనతొడపైకిరమ్మని ద్రౌపదికి సౌజ్ఞచేయును)

భీము —

చ. కురువరవీరవృద్ధజన • కూటమిలోఁ గనుఁగానలేక, మా
సరసిజపత్రనేత్రిని ని • జాంకముఁ జేరఁగఁ బిల్చినట్టి యీ
కురుకులనాశకున్ దొడ వి • గొట్టి సుయోధనుయుద్ధభూమికిన్
గురుబలిబెట్టక న్మరినఁ • గుంతికిఁ దప్పిన వాఁడనౌదునే.

ధృతరాష్ట్రుఁడు—

ఉ. కాటుకకంటినీరు భువిఁ • గాల్వలుగట్టఁగ నేడ్వకమ్మ! నా
మాటలు నమ్మవమ్మ! యను • మానము మానఁగదమ్మ! తల్లిరో
గాటపుచేతలన్ సుతుఁడు • గాసిలఁజేసెఁగదమ్మ! నిన్ను మో
మోటములేక నీసభను • మూర్ఖత సైపఁగదమ్మ! యగ్నిజా!

కులమునకు వన్నెఁదెచ్చితివి. కోడలవన్న నీవేకోడలవు నీవవి

త్రతకుఁ గడు సంతసించితిని. కోరఁదగినవరము వేఁడుము.

ద్రౌప—ధర్మతనయుని దాస్యముదప్పవలయును.

ధృత—ఇచ్చితిని. మరియొకవరము వేఁడుము.

ద్రౌప—తదనుజులకు విమోచనము గలుగవలయు.

ధృత—ఇచ్చితిని. ఇచ్చితిని. మరియొక వరము వేఁడుము.

ద్రౌప—క్షత్రియకాంత కోరఁదగినవి రెండువరములు.

ధృత—పాంచాలీ! అవతరించిన ధర్మదేవతవు! ధర్మజా! ఎరుగక నా సుతులొనరించిన దుండగముల మన్నింతువుగాక. ఎప్పటియట్ల నింద్రప్రస్థపురమున రాజ్యసుఖముల ననుభవింపుము

ధర్మ—గురువుల యాజ్ఞ శిరసావహించెద.

(నిష్క్రమింతురు.) (దుర్యోధన శకుని దుశ్శాసన కర్ణులు వెనుకఁబడి)

దుర్యో—మామా! చేతఁజిక్కినపిట్ట తప్పించుకొన్నది. ఏమిదారి?

శకు—ఎక్కడిమాట! క్రొత్తయురి సిద్ధపఱచితిని.

కర్ణ—ఏది! ఏది?

శకు—తిరిగి జూదమునకు ధర్మజుఁ బిలువవలయు. ఓడినవారు పన్నెండేళ్లు వనవాసము, పదమూఁడవ యేట నజ్ఞాతవాసము జరుపవలయు.

దుర్యో—మేలు! మేలు! మామా! బాగుగ యోచించితివి.

కర్ణ—ఆపై నామాట చూతము.　　(నిష్క్రమింతురు.)

రంగము పూర్తి.

అంకము సమాప్తము.

---




# సంపూర్ణ మహాభారతము.

రెండవయంకము—మొదటిరంగము.

(పాండవులు ద్రౌపది కృష్ణుఁడు ప్రవేశము)

కృష్ణ - సాళ్వునితో యుద్ధముచేయుటకుఁబోయి నేను బదినెలలు లేనందున, శకునిమాయలలోఁజిక్కి సకలమోడిరికదా ? అయ్యయ్యో! ఎంతమోసము !

ద్రౌపది—అన్నన్నా ! ఎంతకష్టమెంతకష్టము !

సీ. పంచపాండవులకుఁ • బత్నియైనన్నుదు
శ్శాసనుండీడ్చెఁ గే•శములఁబట్టి
క్షీరసాగరశాయి • చెల్లెలనై యుండి
వలువలు సభలోన • నొలువఁబడితి
శంభసంభవభీష్మ • కురువీరులేటికో
కూర్చుండిపలుకరు • కొలువుఁజేరి
కరిపుర నాథుని • కర్ణము దరిఁజేరి
కర్ణపిశాచము • గరపునేదొ

గీ. కర్ణుఁడాడిన మాటలు • కర్ణములకు
ములుకులై సోకె క్షత్రియ•ముదితనిట్లు
పరిభవించి విరోధులు • బలసినారు
కాలగతి యెట్టిదో కాని • కంసవైరి !

కృష్ణ—వరుఁడా పార్థుఁడై జన్మించినాఁడు. శత్రుకోటికి నాశము దప్పదు. పార్థతేజము నీపరిభవముకూడి పరిపంథికాననములఁ గాల్పవా ?

అర్జు—

ఉ. అచ్చపుప్రేమఁ గాచెదు ముకుందుఁడు శత్రుసంకీర్ణుఁడు లేరు బల్
హెచ్చుగఁ గిరీటిఁదే మము మహేంద్రసమానులఁ జేయ వేడ్కతో
వచ్చినవాఁడు, కేశవుఁ డవాంతరసంతతము లుండఁబో వికన్
గుచ్ఛితులైన శాత్రవులు కూలక మానరు చింతమానుమా.

భీము—నిన్నుకనకన్న మాడిన కర్ణుఁడు భీభత్సునిచేతను, కుంభజుఁడు దృష్టద్యుమ్నునిచేతను, నిన్నుఁ బరిభవించిన దుర్యోధన దుశ్శాసన హంతకులు నాచేతను మడసెదరు. పాంచాలరాజతనయా ! భీమార్జున ప్రతాపాగ్నికి శ్రీకృష్ణ ప్రసాదానిలము తోడ్పడిన నీపరిభవ దుఃఖాంధకార మంతమొందుట కేమిసందేహము.

ధర్మ—కర్ణుని గవచము దలచుకొన్నఁ గంట నిదురరాకున్నది. రణవిశారదులగు భీష్మ ద్రోణ కృపులఁ దలతునేని గుండె ఝల్లుమనుచున్నది. శత్రుసంహార మెట్లు కాఁగలదు ?

[వ్యాసుఁడు ప్రవేశము.]

వ్యాసు— కీర్తన

1. కృష్ణ ! పాహిమాం - రాధాకృష్ణ పాహిమాం॥
2. ద్వారావతీశా - ధర్మార్థసంభవా ।
దానవాంతకా - కృష్ణా ! దాసపోషకా ।
సాధురక్షకా - రాధాకృష్ణ పాహిమాం ॥కృష్ణ॥
శ్రీకృష్ణభగవానులా !

కృష్ణ—మునిపుంగవులకు స్వాగతము. (అందఱు నమస్కరింతురు.)

వ్యాసు—యుధిష్ఠిర ! మోహాగ్రగణ్యుఁడగు గర్ణుని బరాక్రమము, భీష్మ ద్రోణ కృపుల శస్త్రాస్త్రసిద్ధి, భూరిశ్రవాది మహారథుల యుద్ధనైపుణ్యము, నీకు వ్యాకులము గలిగించుచున్నవి. దివ్యాస్త్రములఁ బడసినఁగాని మీకు జయముగలుగనేరదు. అస్త్రసిద్ధికిసాటి కలదా?

కృష్ణ—బావా ! యుద్ధము వ్యర్థ మనుకొంటివా ?

సీ. రణకేళిఁ దేలిన • రణవిశారదులకు
వాసిగ స్థైర్యము • వృద్ధిఁ జెందు
దివ్యాస్త్రసిద్ధులు • తీండ్రించి తరుగవు
క్షాత్రతేజంబులు • సరకుగాంచు
దుష్టులు కూలఁగ • శిష్టులు బలియగ
ధర్మము నాల్గుపా • దములనడచు
ధనధాన్యవృద్ధిచే • ధర ప్రవర్ధిల్లెడు
దేశములు శాంతి • తేజరిల్లు
సమతతో నోర్చున • సర్వజనంబులు
శాంతులై కలహము • జంపుకొంద్రు

గీ. ధనము దేశము క్షాత్రము • ధర్మగుణము
లార్యభావము వీర్యము • లతిశయిల్లు
రణవిదూరులు స్వాతంత్ర్య • రాజ్యపదవిఁ
బొందనేరక భ్రష్టులై • పోరె జగతి.

వ్యాసు—భీష్మద్రోణకృపవీరులఁ బరాజితులఁ జేయుటకు ముఖ్యసాధనము దివ్యాస్త్రసిద్ధియే. నాచే నుపదేశింపఁబడు ప్రతిస్మృతియను నీవిద్యను బార్థుఁడు గ్రహించుగాత. దేవతల నీశ్వరుని బ్రత్యక్షము జేసుకొని దివ్యాస్త్రములఁ బడసి శత్రువుల జయింపుడు.

ధర్మ—సీ. సురపతి సేవించి • పురహరు మెప్పించి
పాశుపతంబు చేఁ • బట్టి రమ్ము

వ్యాసు—దమశమయుతమైనఁ • దపము గావించి యా
కాలకంఠరు మెప్పుఁ • గాంచిరమ్ము

ద్రౌపది—శత్రుసంహారము • జరుపఁగాఁ బనిఁబూని
యష్టసిద్ధులనెల్ల • నందిరమ్ము

భీము—సభ నాఁడు చేసిన • శపథము సమకూర్ప
దివ్యాస్త్రశస్త్రముల్ • తెచ్చుకొమ్ము

ద్రౌపది—గీ. అరికృతపరాభవార్ణవ ♦ మందు మునుగు
మమ్ముఁ దేల్చవే కరుణించి ♦ మాన్యచరిత
ఇందిరేశుఁడు దిక్కులా ♦ యిందుధరుఁడు
గాడ్పు సోముఁడు ధాతయుఁ ♦ గాచు మిమ్ము.

(నిష్క్రమించిరి.)

రంగము పూర్తి.

## హిమవత్పర్వతము.

[అర్జునుఁడు తపస్సుచేయుచుండ కిరాతవేషధరులై పార్వతీపరమేశ్వరులు ప్రవేశింతురు.]

శంక—సీ. వాయువు బంధించి ♦ వనవాసమున కోర్చి
కఠినదీక్ష నున్నట్టి ♦ కవ్వఁడితఁడు
పార్వ—వాయువు భక్షించి ♦ వాసి నిగ్రహమొంది
నాకవాసుల మించు ♦ నరుఁడితండు
శంక—యూర్ధ్వబాహుండయి ♦ యోర్పున సమతతోఁ
పాదాగ్రమందున్న ♦ బార్థుఁడితఁడు
పార్వ—గాండీవధారియై ♦ కార్ముకహస్తుఁడై
సిద్ధులఁ గోరుప్ర ♦ సిద్ధుఁడితఁడు
గీ. కాలకంధర నిన్గూర్చి ♦ కఠినతపము
జేయుచున్నాఁడు పూనికఁ ♦ జెరుపనగునె ?
దేవదేవుఁడ ! సర్వేశ ! ♦ దివ్యమూర్తి !
వరద ! యియ్యవే వరముల ♦ వాంఛితముల.

శంక—మూకదానవ !

మూక — పరమేశ్వరుని యాజ్ఞ !
శంక — సూకరరూపుండవై నరునిఁ దాఁకుము.
మూక — మహాప్రసాదము. (పందియై యర్జునునిపైఁ బడుచున్నాఁడు.)
అర్జు — నాతపోవిఘ్నము గావింప వీఁడెవఁడో దనుజుఁడు పందిరూపమునఁ బైఁబడ నుంకించుచున్నాఁడు. (అని బాణ మేయఁబోఁగా)
శంక — కొట్టకు కొట్టకు. (బాణము వేయుచు) నాశరాహతిఁ గూలినది
అర్జు — కాదుకాదు నాప్రేటున కీల్గినది. నీ వెవఁడవు ? నేనేసిన పందినేయ నీకు ధర్మమా ? పాఱిపోక నిలువుము. నిన్నుఁ గాలునిసన్నిధి కంపుచున్నాఁడ.
శంక — ఏమి యీమాటల ధాటి ? శరకాండము వచ్చుచున్నది. పాఱిపోకుము.
అర్జు — అశనిసదృశములగు నాశరంబులు మదీయయక్షయశరధుల నిర్గమించుచున్నవి. కాచుకొమ్ము.
శంక — యక్షయతూణీరమా ? (నవ్వుచు) ఏది ? ఏది ?
అర్జు — (తూణీర మదృశ్యము కాఁగా) ఏమిచిత్రము ! కాండవము దగ్ధముచేయువేళ వీతిహోత్రుఁడు నాకొసగిన యక్షతూణీర మదృశ్యమగుట విచిత్రము. వీఁడెవఁడై యుండనోపు ?

సీ. కాఁడుకదా పాక • కంటకదమనుండు !
సకలదేవవిభుఁడు • శచివిభుండు
కాఁడుకదా యాది • కమలసంభవనేత
వారిజయోని యా • వాణివిభుఁడు
కాఁడుకదా యల • కంజాతనేత్రుఁడు
కాలచక్రధరుఁడు • కమలవిభుఁడు
కాఁడుకదా వీఁడు • కాలకంధరమూర్తి
గరళకంఠుఁడు మహా • కాళివిభుఁడు

గీ. వనజనేత్రుఁడో ! నన్గన్న • వాసవుండో !
వహ్నినేత్రుఁడో ! యాదిమ • వనజభవుఁడో !

కాక నన్ దాకి యోర్చునా ◆ కదనమందు?
రూపు ఘోరము తేజము ◆ రుద్రు మరయ.

ఎవ్వఁడైన నేమి? నాగాండీవఘాతమున వీనిశిరఃఖండనము గావించెద. (గాండీవము విసరివేయుచున్నాఁడు)

శంక—(గాండీవము పడిసిపట్టుకొని) నీ వపహృతగాండీవుండ వైతివి.

అర్జు—సురాసురు లేకమై కైకొన్న వమ్ముబోని నాగాండీవము నిరర్థకమయ్యె.

సీ. మనుధర్మశాస్త్రముల్ ◆ మఱచి వర్తించితో
వేదవిధావళి ◆ విడచినానొ
నీతిశాస్త్రంబుల ◆ నిందించినానేమొ
పాషంఘులతోడఁ ◆ బలికితేమొ
పాండుభూవిభునకుఁ ◆ బట్టిని గానేమొ
కుంతికిఁ బుట్టినఁ ◆ గొడుకుగానొ
ధర్మజునకు ముద్దు ◆ తమ్ముఁడఁ గానేమొ
మధువిరోధికి బావ ◆ మఱఁదిఁ గానొ
గీ. క్షాత్రధర్మము మదిలోన ◆ సరకుఁగొననొ
భారతీయుఁడ నై దేశ ◆ భక్తి లేదొ
కులము గోత్రము శీలము ◆ గూలనడచి
చేసినా నేఁడయో నేగి ◆ చేతులార.

కాదు. కాదు. చంద్రవంశస్థులధర్మమార్గములఁ గాలిడరు. భారతీయులు ఘోరసంగ్రామమందేని వెనుకంజ వేయరు. ధైర్యమా! న న్విడనాడకుము. క్షాత్రమా! న న్నావహింపుము. మల్లయుద్ధంబున వీని నేలఁ బడఁగొట్టెద.

(శివునిపైఁ బడి మూర్ఛబోవుచున్నాఁడు.)

పార్వ—గీ. అంధకారి నీభక్తికి ◆ నాత్మ నలరి
వచ్చియున్నాఁడు లేలెమ్ము ◆ వరము లివ్వ
వాసవాత్మజ! చూడుమీ ◆ వరదు నీశుఁ

పాశుపతధారు ఘణిహారుఁ ♦ బాపదూరు.

శంక—భరతవంశాబ్ధిసోమా పాండవమధ్యమా! నీతపోస్తోత్రములకు మెచ్చితి. లేలెమ్ము. (మూర్ఛ తెలిసి యర్జునుఁడు లేచును.) నీకు దివ్యదృష్టిఁ బ్రసాదించితి. నానిజరూపమగు మహేశ్వరస్వరూపముఁ గాంచి కృతార్థుఁడవు కమ్ము.

అర్జు—(మోకరించుకొని)

ఉ. కంటిని నేఁడు నీదులయ♦కాలపురూపము విశ్వరూపమున్
గంటిని పూర్వపుణ్యమునఁ ♦ గాలునిదూతల కందనంటి నా
పంటలు పండెనంటి ఘన ♦ బంటుతనంబున శత్రుకోటులన్
గెంటితినంటి నీమహిమఁ ♦ గీర్తన సేయఁగ నెంతవాఁడ నే
నంటిని పార్వతీశ! యగ♦జాధిప! చేకొనుమంటి శీఘ్రమే.

శంక—ఫల్గుణా! నీవు తొల్లి నరుఁ డను మహాఋషివి. పురందరపట్టాభిషేకమహోత్సవసమయంబున సకలదానవసంహార మీగాండీవముచే నీ వొనరించితివి. ఈగాండీవాక్షయశరధులు నామాయామహిమంబుచే నపహృతంబు లైనవి. ఇదే చేకొనుము. వలయువరము ల వేఁడుము.

అర్జు—చంద్రధరా! నిన్ను సేవించి సంపూర్ణకార్యసిద్ధి నొందనివాఁడు కలఁడా? దాక్షాయణీకళత్రా!

గీ. ఘననిరంకుశప్రభుల దం ♦ డనముకొఱకు
భారతీయులదాస్యముఁ ♦ బాపుకొఱకుఁ
బాశుపతదివ్యబాణము ♦ పరమపురుష!
యియ్యవే నాకు నీశాన! ♦ యిందుమౌళి!

శంక—గీ. పరమపావనకర మైన ♦ పాశుపతము
నొసఁగుచున్నాఁడఁ జేకొమ్ము ♦ యొప్పి రణవి
శారదుల యోధవరులఁ ♦ బాఱఁదఱిమి
దీన గెల్తువు జేజేల ♦ దిక్కులెల్ల.

పార్వ—భీష్మ ద్రోణ కృప కర్ణాదియోధుల దీనఁ గెలువఁగలవు. నీకు

శుభం బవుఁగాక. మేము పోయివచ్చెదము.

అర్జు— జగత్పితరులగు నుమామహేశ్వరుల కిదే మనఃపూర్వకయభివా దనసహస్రములు.

పార్వతీపరమేశ్వరులు—కల్యాణమస్తు. (నిష్క్రమించిరి.)

[ఆకాశమునుండి మాతలి రథముతో దిగుచున్నాఁడు.]

మాత—బృందారకాధిపనందనా ! జయము. జయము. నేను దేవేంద్రుని రథసారథి మాతలి యనువాఁడ. భవజ్జనకుఁడు, దేవవిభుఁడు పాశుపతాస్త్రధారివగు నిన్నుఁ జూడఁ గాంక్షించుచున్నాఁడు. శచీకళత్రుని కోరికఁ దీర్ప దివంబునకు విచ్చేయవలయు.

అర్జు— నాకాధిపునియాజ్ఞ శిరసా వహించుచున్నాఁడ.

(రథం బెక్కి స్వర్గంబునకుఁ బోవుచున్నాఁడు.)

రంగము పూర్తి.

---

రెండవ యంకము — మూఁడవ రంగము.

ఇంద్రుని మందిరము.

[అర్జునునియెదుట నూర్వశి మొదలగునప్సరసల నృత్యము]

ఊర్వ—అమరేంద్రనందనా ! మాయుపచారములు నీకు రుచించుచున్నవో. లేదో ?

అర్జు—అప్సరోమణి !

ఊర్వ—అహో ! రారాఁజుల భుజపీఠముల నలంకరింపకున్న నీమణుల ఫల మేమి ?

అర్జు—త్రిలోకాధినాథుఁడగు నాఖండలుని భుజపంజరమున కిచ్చటి యచ్చరలు తెలుచు నలవడిన వారేకదా !

ఊర్వ—క్రొత్తదే వింత. పాతది రోతకాదా? మధుప మొకపువ్వువిడిచి

మఱియొకదానికిఁ బోదా ? ఆహా ! అగరు కస్తూరి పరిమళముల మించి యీశయ్యాతలము సువాసనల నీనుచున్నది.

(అర్జునుని శయ్యపైఁ గూర్చుండుమను.)

అర్జు—మాసినీ ! నాసెజ్జపైఁ జేరనగునా ?

ఊర్వ—అవశ్యము చేరవచ్చును. తప్పేమి ? నిన్న నీవింద్రుని యర్ధాసనమునఁ గూర్చుండలేదా ?

అర్జు— ఔను. కూర్చుంటిని.

ఊర్వ— ఇంద్రాసనమునకు హక్కుగల నీకు సురేంద్రుని నుపభోగముల యందుఁ బాలుండదా ?

అర్జు—కాంతా ! నీవు నేర్పరివి.

ఊర్వ—కాకేమి ? కదనమున నీనేర్పెట్లో, మదనకదనమున నానేర్పట్లు. ఫల్గునా ! మందాకినీ నిర్గత మందమందానిలంబుల చల్లందనము జవి గొనుటలేదా ? నందనోద్భవ పారిజాత కంద మకరంద పానాయత్త మత్త మధుపంబుల ఝుంకారంబుల వినుచుంటివా ? కల్పతరులనీడలు, కోకిలలపాటలు, రాయంచలనిస్వనంబులు, శుకనికరంబుల మనోహరనినాదంబులు గనుచుంటివా ? సర్వానందదాయకంబగు నీసురలోకంబున నచ్చరమచ్చకంటితో ముచ్చటించుట లభించినదే. పెడ మొగముపెట్టుట నీబోటి పురుషసింహులకుచితమా ?

అర్జు—గీ. పడతి ! పరదారకూటమి • పాపకరము
కర్మ్యమున కది కూడని • కర్గమబల
ధృతివినాశము ధైర్యము • దప్పుఁదాని
వలన నిహపరసౌఖ్యముల్ • వలసబోవు !

ఊర్వ—అబ్బా ! ఎంతనంగనాచివి. ఏమి యెరుగవు కాబోలు !

గీ. వ్యాళకన్నె యులూచి నిన్ • వలచినపుడు
పెద్దసందడి మరచితో • పిన్నతనమొ
వలపు తలకెక్కెనో ! నన్ను • వావివరుస
నీతిజాతుల పనిలేదో • నేఁడె కాని ?

అర్జు—ఊర్వశీ ! నీ కీ స్వేచ్ఛావిహారము దగునా ?

ఊర్వ—ఈలోకంబున స్త్రీపురుషులు స్వేచ్ఛగా విహరింతురు. ఇచ్చట సది నింద్యము కాదు. దివంబునకు వచ్చితివి కాన నీ వట్లుండుట యావశ్యకము. నాది స్వేచ్ఛమైన వలపు. వలచినవాఁడే విభుఁడు.

అర్జు—కాదు కాదు. భారతీయుల కగ్నిసాక్షిగ వివాహమాడినదే భార్య.

ఊర్వ—నిజమైన వలపెట్టిదో యెఱుఁగక యట్లంటివి.

సీ. భర్తలే దైవమన్ ♦ భక్తి నమ్మిన నీదు
వనిత కేమెఱుక నా ♦ వలపుమహిమ
మత్స్యయంత్రముఁగొట్ట ♦ మదిమెచ్చి వచ్చిన
ఘనకన్య యెఱుఁగు నా ♦ వలపుమహిమ
మేనత్తకొడుకని ♦ మెచ్చి నిన్ జేరిన
వనజాక్షి యెఱుఁగు నా ♦ వలపుమహిమ
పుత్రార్థియై నీదు ♦ పొందుఁ జేసిన పాండ్య
భామ కేమెఱుకఁ నా ♦ వలపుమహిమ
గీ. నీవు సౌందర్య లావణ్య ♦ నిధి వటంచు
వలచి తమిఁ జెంది నలరాజు ♦ వశమునొంది
కంది మదనాగ్ని సాక్షిగాఁ ♦ గౌఁగలించి
సుఖపయోనిధిఁ దేలుము ♦ సుఖము లిత్తు.

అర్జు—వనజాక్షీ ! ఇట్లు కోరనగునా ? కర్మభూమియగు భరతఖండమున నుద్భవించిన నేను గర్మ ప్రధానముగాఁ గలవాఁడ. శరీరమే ధర్మసాధనము. కర్మలకు శరీర మావశ్యకము. దివ్యదేహసిద్ధి కర్మసిద్ధికొఱకే. తుచ్ఛసుఖములకుఁ గాదు.

ఊర్వ—జితమార !

కీర్తన.

ఎట్టుల దాటుదు నీ - మోహజలధి
వసిష్ఠ తాపసవరా - మనోహరా ॥వసిష్ఠతాపసవరా॥

వివిధరతుల - విరిశయ్యఁ జుట్టినను
యంకమునను జేర్చి వించి - మఱి మఱి వాతెరరసమానక
యీచింత, నంత పొందనేలరా ॥ఎట్టు॥

అర్జు— దేవానీకము జూచిన నగరే - దేవత నీవని కోర్వఁగఁగలరే
దేవనాయకుని ప్రియసతి వైతివి - నీతి, జాతి,
పోవనెంచ నేలనే ॥ఎట్టు॥

ఊర్వ— నేఁ గోరినది కాసంత పని. దానికిఁ గొండంత చదువుచదివితివి. ధర్మార్థకామములు పురుషార్థములు. ధర్మ మెట్టిదో కామ మట్టిదే. పురుషార్థముల సమముగా నడుపవలదా? పోనీ! కర్మల ఫలితార్థమేమి? అశ్వమేధాదియాగములు గావించుటకు ఫల మప్సరాంగనల పొందేకదా? అది యప్రయత్నముగా లభించుచుండ వెనుకంజ యేల వేసెదవు. లేలెమ్ము.

అర్జు— మగువా! దుడుకుతనము మానుము. మావంశకర్త యగు పురూరవునకు భార్యవు. నాతండ్రియగు సురవిభున కచ్చరవు. నాకుఁ దల్లివి కావా? ఈవికార మేల? మన్నించి తొలఁగి పొమ్ము.

ఊర్వ— భరతపుత్రా! ఇదియా నీసంశయము?

గీ. మొదట నే పురూరవుభార్య • మొగిడి యింద్రి
సేవ జేసితి నాతని • జిన్నికొడుకు
వంశపరమున వచ్చెడి • వారసౌఖ్య
మనుభవింపక విడుచుట • యర్హ మగునె?

నీతండ్రి శతక్రతువులఁగావించి యింద్రపదవి నలంకరించె. నీవు నీసుతుఁడు నీమనుమఁడు మఱి యెందఱెందఱో నూఱుయజ్ఞములఁ జేసి సురేంద్రు లగుదురు. నే వారందఱిని సేవించవలసినదాననేనా? వెలయాలికి వరుస యేటికి?

సీ. రాకేందుబింబమున్ • రమ్మ పొమ్మనఁ జాలు
నాననం బొకసారి • యంటనిమ్ము

మిగులముగ్గినదొండ • మిసిమిమించినమంచి
యధరోష్ఠ మొకసారి • యానవిమ్ము
కంబుసమానమౌ • కంఠంబు చేతుల
గట్టిగా నొకసారి • జుట్టనిమ్ము
విపులమై ఘాత్రము • వెడజల్లు నురమున
నుర మొకసారి నన్నుంచనిమ్ము

గీ. చెక్కుటద్దాల ముద్దులఁ • జొక్క నిమ్ము
సిగ్గు లేటికి? నంకముఁ • జేరనిమ్ము
సురతఁ దేలించి సోలించి • సొబగు మించి
విరులశయ్యపైఁ జేరి సే • వించనిమ్ము.

సువాసనలు, సునాదములు, రాయంచయానలగుమదవతులు భూలోకమునమాత్రము లేరా? అప్సరస లపరూపము. అట్టి వస్తుసమాగమము ప్రయత్నములేకుండ లభించుచున్నదే? మదనుఁ డదయుఁడై విరిశరముల నాపై విసరుచున్నాఁడు. నిన్ను శరణుజొచ్చితి. శరణార్థులఁ గాపాడుట క్షత్రియధర్మము కదా? కరుణించ వేల?

అర్జు—కుతర్కముల విడచి మన్నించుము. పూర్ణకటాక్షవీక్షణమునఁ దొలఁగిపొమ్ము.

ఊర్వ—(కోపముతో) అబ్బా! నీహృదయము రాల నిర్మించినట్లున్నది. నానిజమగు వలపు నిరర్థకముఁ జేసి, నాప్రార్థన వ్యర్థపుచ్చి, జవ్వనగర్వాంధమగ్నుండవై, గంపెడు యాశతో నున్న నన్ను నిరాకరించి పరిభవించితివి గాన, భూలోకమున స్త్రీజనమధ్యంబున నపుంసకుండవై జీవయాత్రఁ గడుపుము (స్వగతము) అబ్బా! వీని నిబ్బరము. (వెళ్లిపోవుచున్నది.)

[అర్జునుఁడు రిచ్చపడుచున్నాఁడు. ఇంద్రుఁడు ప్రవేశము]

ఇంద్రు—కుమారా! నీమనోనిబ్బరమునకుఁ గడు సంతసించితి. స్వర్గవాసులు నీకోటికి సరిరారు. అప్సరసల మాయోపాయంబులు నీయందు నిరర్థకము లయ్యె. సకలదిగ్విజయము నీస్వాధీనమై యున్నది.

సవ్యసాచీ ! ఊర్వశి యిచ్చినశాపము తప్పదు. కాని యజ్ఞాత వాసమం దది నీ వనుభవించి తదుపరి విమోచనము గాంతువు. పుత్రా ! దివ్యాస్త్రముల నొసఁగుచున్నాఁడ గ్రహింపుము. ఈకిరీట కవచంబుల నిచ్చుచున్నాఁడ. ఈమాతలిప్రయుక్తంబగు రథం బెక్కి పాతాళంబున కేగి నివాతకవచకాలకేయుల వధించి దేవహితము గావింపుము. దేవదత్త మనుశంఖంబుఁ గొనుము.

అర్జు—మహాప్రసాదము.

(నిష్క్రమింతురు.)

రంగము పూర్తి.

రెండవ యంకము—నాల్గవ రంగము.

ద్వైతవనము- పాండవులు ప్రవేశము.

ధర్మ—సోదరులారా ! పార్థుఁ డెచ్చట నున్నాఁడో ? పాశుపత మందెనా ? ఎట్టియిక్కట్టుల నందుచుండెనో ?

[అర్జునుఁడు ప్రవేశము]

అర్జు—గీ. అగజవల్లభు మెప్పించి, • యస్త్రసిద్ధి
గాంచి, సురనివాసంబు నా • కంబుఁ జేరి
కామ్యసిద్ధుల సర్వముఁ • గాంచినట్టి
పార్థుఁ డెరగెఁడు నన్నల • పాదములకు.

ధర్మ—(అర్జునుని గౌఁగిలించుకొని) సకలాస్త్రసిద్ధిని బడయుటచే నాకలిపురాధినాథుఁడు వీఁకఁ జెడి కూలినట్లు విందగుచున్నది.

అర్జు—పురహరుఁడు కిరాతరూపధరుఁడై వచ్చి పాశుపత మొసఁగినాఁడు. నగభేది యభేద్యమగు కవచమును, స్వకిరీటమును, దేవదత్తమను శంఖము నొసంగె. మాతలిప్రయుక్తంబగు రథం బెక్కి నివాతకవచకాలకేయుల నుక్కడఁగించి వచ్చితి.

(తెరలో రథధ్వానము.)

భీము—విద్యుల్లత్ప్రయుక్తమగు నీరదమువలె నీలవర్ణుఁడు సత్రాజిత్సహితముగ విచ్చేయుచున్నాఁడు.

[కృష్ణుఁడు, సత్య ప్రవేశము.]

కృష్ణు—ధర్మజున కభివాదనము. (భీమార్జునులఁ గౌఁగిలించును.)

ధర్మ— దేవదేవ! నిటలాక్షుని మెప్పించి పాశుపతముఁ దెచ్చినయర్జునుఁ గంటివా?

కృష్ణు—శమదమసార!

ఉ. ధర్మము నీదుసొమ్ము రణ ♦ ధర్ములు నీరులు నీసహోదరుల్
నిర్మలపుణ్యసంఘములు ♦ నీద్రుపదాత్మజసొమ్ము కాదె? స
ద్ధర్ములు నీదుబాంధవులు ♦ దానపరుండవు ధర్మదేవుఁడో
ధర్మనిగూర్మిపట్టివి స ♦ దా నను నమ్మితి; లోప మెందునే?

వనవాసక్లేశమున నోర్చి వ్రతులై, తపం బాచరించి, సకలసద్గుణముల సాధించితిరి. పాశుపతాదిదివ్యాస్త్రసంఘములఁ జేకొంటిరి మీఖ్యాతి లోకవ్యాపితమై రాజానీకమును సమాకర్షించుచున్నది. అంధక వృష్ణి భోజ కుకురాన్వయభూవరులు భవదాగమనంబు నిరీక్షించుచున్నారు. లోభమోహాంధులైన ధార్తరాష్ట్రు లపజయముఁ బొందుదురు. వనవాసశేషము నజ్ఞాతముఁ గడపి త్వరపడుఁడు.

(కౌరవయోధుఁడు పరుగునఁ బ్రవేశించి)

కౌరవయోధుఁడు—ధర్మజా! శరణు! శరణు! రక్షింపుము! రక్షింపుము! దుర్యోధనాది కౌరవవీరుల గంధర్వరాజు బంధించుకొని పోవుచున్నాఁడు. దేవా! కాపాడి రక్షింపకున్నఁ గురువినాశము సిద్ధము.

భీము—గీ. చిత్రసేనుఁడు మనపని ♦ జేసిపుచ్చె
వచ్చె విజయము తనకుఁ దా ♦ వలచి మనకు
వారు దీసినగోతను ♦ వారె పడిరి;
కలుషచిత్తులు వృద్ధిని ♦ గాంచఁగలరె?

ధర్మ—వృకోదర !

చ. నరనుత ! మారుతాత్మభవ ♦ నాగసికేతనుఁ డాత్మసోదరుం
డరిజనబద్ధబాహుఁడని ♦ యబ్బురమాటలు విన్నమాత్రనే
కరుఁగదె నీదు మానసము ♦ గాదిలితమ్ముఁడ ! దేవయోనులన్
దరుముట గొప్పకాదె ? ధర ♦ దర్పసమేతుఁ డసంగ నొప్పదే ?

భీము—అగ్రజా ! మీరింకను శాంతినే పూనుచున్నారా ?

చ. జలమునఁ ద్రోయఁడే? విషము ♦ జావఁగఁబెట్టఁడే? కొంపఁగాల్పఁడే!
యలయక మాయజూదమున♦ నందఁడె రాజ్యము। కొప్పుబట్టి యీ
తలిరులబోణి నీడ్చె సభఁ ♦ దమ్మునిచే నొలిపించె వస్త్రముల్
చలమున కాలయం బితనిఁ ♦ జంపిన దోషము లేదు భూవరా !

ధర్మ—తమ్ముఁడా ! శత్రువు శరణుజొచ్చినఁ గాచుట కర్తవ్యము అర్థ విషయమున జ్ఞాతులకు సహజవైర ముండినను, బరులు దండెత్తివచ్చినప్పు డందఱేక మగుట పరమధర్మము. దుర్యోధనుఁడు నీవు మహావీరుఁడ వని నీపై నాశచే నెదురు చూచుచుండు. జాగేల ? తమ్మునిఁగూడి చని గంధర్వులఁ దఱిమి సుయోధను బంధవిముక్తునిఁ గావింపుము.

కృష్ణ—గీ. అరయఁ బగవాఁడు నీవాఁడ ♦ నంచు రాఁగఁ
గావకుండుట క్షాత్రము ♦ గాదు సుమ్ము !
జ్ఞాతివైరము మాని వి ♦ జ్ఞానదృష్టిఁ
జూడు; సర్వము నొక్కటే ♦ శోధకులకు.

శరణాగతులకుఁ బ్రాణదాన మిచ్చుట పరమోత్తమధర్మము. దీన ఖ్యాతియు శత్రుపరాభవము లభించు.

భీము— దేవా ! నీసమ్మతమే మాసమ్మతము. అనుజా ! లెమ్ము.

(నిష్క్రమింతురు.)

సత్య—వనజాక్షా ! మావదిన పాంచాలి మాయన్నల నెట్లు వశము చేసుకొన్నదో ?

కృష్ణ— అడిగిచూతము.

సత్య—ద్రుపదాత్మజ! కౌంతేయు లందఱు నీ కనురక్తులు. వన్యములగు మంత్రౌషధంబుల నేర్చిన నా కనుగ్రహింపుము. పురుషోత్తముఁడు నాకు వశవర్తి గాకున్నాఁడు.

ద్రౌప—సత్యా! నన్ను దుష్టవనితగాఁ దలంచితివో! మాయన్నకుఁ దగినదానవు కావు సుమీ! భర్తల వశము జేసికొనుటకు దివ్యౌషధ మిది.

గీ. నాథుఁ డేతెంచినాఁ డన • నాతి లేచి
నవ్వుదేరఁగ నెదు రేగి • పువ్వుఁబోఁడి
వలయు నుపచారములఁ జేయ • వలయుఁ గాని
దాసజనుల నియోగింపఁ • దగదు తగదు.

భామకు భర్తయే దైవతము. భర్త మెప్పుఁ గాంచిన సామజ యానకు సంతతి మాన్యత భాగ్యభోగ్యములు నిస్సీమములు కలుగు.

గీ. ఊర విభుఁడు లేనప్పు డో • యువిద! వలదు
పుష్పగంధదీప్త్యాధిక • భూషణాళి;
సుతులతో నైన నొంటరి • సుదతి కెప్పు
డేకశయ్య నుండఁ దగదు • వీఁక చెదును.

నన్ను తాఁగి! పాండవేయులు సర్వకుటుంబభారము నాయందునిచి యిష్టవిహారంబుల నుందురు. ధర్మతనయునిపంక్తిని నిత్యము పసిడిపళ్లెరముల భుజించు బ్రాహ్మణు లెనిమిదివేలు. యతులు పదివేలు. అభ్యాగతులు, భోజనంబు లొసఁగూర్చు పరిచారకులు నూఱువేలు. మత్తగజశతసహస్రంబు, లుత్తమాశ్వశతసహస్రంబు, లఖండభాండాగారంబులు, గోపాలజనంబులు తుదిగా సకలజీవితంబుల నరసి నే నడుపుదు.

గీ. ఇట్టి సంసారభారము • నేను దాల్చి
పాండవుల మెప్పుకై పాటు • పడుదుఁ గాని
లలన! నీవన్న యింద్రజా•లముల మాయ
మందు మాకుల నెఱుఁగ నో • యిందువదన!

[భీమార్జునులు చిత్రసేనుఁడు, బద్ధులై దుర్యోధనాదులు ప్రవేశింతురు.]

దుర్యో—హాతవిధీ! పాశముల బంధించి శత్రుసమ్ముఖమునకు నన్నుఁ గొనిపోవుచుంటివా? నాయౌన్నత్యమును బ్రకటించి పాండవులఁ బరిభవింప వచ్చితినే! నన్నే పరిభవింతువా? నేఁ దీయుచున్నగర్తమున నన్నే పడవేతువా?

చిత్ర—దేవదేవుఁడగు గోవిందుఁడా! ఏమి నాపుణ్యము?

కృష్ణు—గంధర్వనాయకా! దేవవిభునకుఁ గుశలమా?

చిత్ర—నందనందనా! సకలేశ్వరుఁడవగు నీవు పూర్ణకటాక్షమునఁ జూచుచుండ శక్రాదులకు క్షేమము గాక మఱేమగును? దేవా! ఈ దుర్యోధనుఁడు పాండవులఁ బరిభవింప నిందుఁ బ్రవేశించుట యెఱిఁగి యమరవిభుఁడు వీనిని బట్టితెమ్మని నా కాజ్ఞాపించె. సుయోధనుఁ బట్టి కట్టించితి. నీయాజ్ఞ నాకలంఘ్యము. సెల వేమి?

కృష్ణు—చిత్రసేన! ఈ ధర్మజుఁడు,

క. చతురంబోధిపరీవృత
భూతలరాజ్యంబు నేలు • భూధవుఁ డితఁడే
యీతని యాజ్ఞ నడుపవలె
భూతలమున నీవు నేను • బుధసత్తములున్.

దుర్యో—హా! వినఁజాల- వినఁజాల! నాశరీరము వహ్ని లేకనే దహింపఁబడుచున్నది. నే నెచ్చట నుంటిని? ఇది భూమియా? లేక యాకసమా? నేఁ జక్రవర్తినా? శానిసనా?

చిత్ర—యుధిష్ఠిర! అజాతశత్రుఁడవగు నీకు వారు వీ రనుభేదము కలదా? అమరనాయకునిపని నివర్తింపనిమ్ము.

ధర్మ—గంధర్వరాజా! సుయోధనాదులు మాకు సహోదరులు కారా? కురుక్షయము మావంశక్షయము కాదా? మానిమిత్తము వీరిని బంధవిముక్తులఁ జేయుము. దేవనాథునితో మాకొఱ కట్లొనరించితి వని విన్నవింపుము.

చిత్ర—ధర్మనందనా! నీవు ధర్మస్వరూపుఁడవు. నీ వెఱుఁగని న్యాయము కలదా? నాకు సెల వొసంగుము. పోయి వచ్చెద.

(నిష్క్రమించును. దుర్యోధనాదులు బంధవిముక్తు లైరి.)

ధర్మ—సోదరా! భవజ్జనకుఁడు మీరాక కెదురుచూచుచుండును. మీరందఱు పురంబున కేగుఁడు.

దుర్యో—(స్వగతము) పురంబున కేగుటకంటె యమపురంబున కరుగుట మేలు. భూచక్రంబునకెల్ల నేకచ్ఛత్రాధిపతియగు దుర్యోధనమహారాజునకా యిట్టిపాట్లు! పట్టణంబున కేగి నాముఖ మెట్లు నాయంతఃపురకాంతలకుఁ జూపఁగలను? మంత్రి పురోహితులతో నెట్లు మాట్లాడఁగలను? సామంతుల నెట్లు పలుకరించఁగలను? తల్లిదండ్రుల ముఖ మెట్లు చూడఁగలను? విదురుఁ డెట్లు పరిహసించునో? పితామహుఁ డెంత నిందించునో? ఈఘోరారణ్యమునఁ బ్రాయోపవేశుండనై ప్రాణపరిత్యాగంబుఁ జేసెద. (నిష్క్రమింతురు.)

కృష్ణు—కౌంతేయా! అజ్ఞాతదీక్షకుఁ ద్వరపడుము. నేఁ బోయివచ్చెద.

(నిష్క్రమించును.)

ధర్మ—తమ్ములారా! వనవాసము సమాప్తమైనది. మనము మాఱు వేషములతో సజ్జనుఁడగు విరటుని గొల్వ మత్స్యదేశమున కరుగుదుము రండు.

(నిష్క్రమింతురు)

రంగము పూర్తి.

---

రెండవ యంకము — అయిదవ రంగము.

సుధేష్ణ యంతఃపురము.

ద్రౌపది—విధికృత మెట్టివారికిఁ దప్పదు.

సీ. ఎల్లరాజ్యంబుల ♦ నేలఁజాలినమేటి
కథలతోఁ గాలము ♦ గడపు నేఁడు
కిమ్మీరదైత్యుని ♦ గిన్కఁ గూల్చినజెట్టి
వంటలఁ జేయఁగ ♦ వలసె నేఁడు
దైత్యగంధర్వులఁ ♦ దరిమిన శూరుఁడు
చెలులకు నృత్యముఁ జెప్పు నేఁడు
సూర్యు నెఱుఁగనట్టి ♦ సుకుమార లోకవల్
సేవకవృత్తిలోఁ ♦ జిక్కె నేఁడు
గీ. అహహా! విధిదాటవశమానె ♦ హరునికైన
గట్టికుడిపించు మనపూర్వ ♦ కర్మచయము
పాటిపోయినఁ దప్పవు ♦ పాపఫలము
లనుభవింపక తీరునా ♦ యజునివ్రాత.

అజ్ఞాతవాసతత్పరులైన మత్పతులు సేవకు లోనైరి. విరటునకుఁ గథలఁ జెప్పుచున్న ధర్మసూతిఁ గాంచిన నాహృదయము నీరగుచున్నది. శరభ శార్దూల మత్తేభముల నంతఃపురకాంతల వినోదమునకై ఢీకొను వాయునందనుని జూచిన నాహృదయము వెయ్యిశకలంబులగుచున్నది. పార్థుఁడు పేడియై నృత్యగురు వయ్యె. ఇంతకన్న విషాదము కలదా? కవ లశ్వపశుపాలకులైరి. మాయత్త కుంతీమహాదేవి వీరిని నాకుఁ బనిపూని యొప్పగించె. ఆమాటలు నన్ను దహించుచున్నవి. నాసేవకుఁ జింతింతునా? నాపతులగతికి విలపింతునా! విధి యలంఘ్యము!

[కీచకుఁడు ప్రవేశము.]

కీచకుఁడు— కీర్తన.

హాయి హాయి- హాశ్చర్యమాయె-
మాయురె యీసేమ మహాత్మ్యమేమొ ॥హాయి॥
నిగనిగలాడెడు - నగుమోముతో
వగగులుకు భామ - వనజాక్షులఁ గన ॥హా॥

అందముగల బల్ మందగమనముల
సందడి తరిగెడు సుందరులను గన ॥హా॥

మాసోదరి సుధేష్ణకు నమస్కరింప వచ్చితి. (ద్రౌపదిని జూచి) ఈ రాకేందువదన యెవరు? ఎందఱనో యచ్చరమచ్చకంటులం గాంచి యుంటిని. ఇట్టి దివ్యమంగళసౌందర్యవిగ్రహ మెచ్చటం గనియుండ లేదు. సువర్ణభూషణదుకూలాంబరసేవ యీమె మెచ్చదా యేమి? అది యొకయందమే! సుమశర! నీయస్త్రవిన్యాసము నాపై నా చూపెదవు? అదుగో! నీముల్కులశకం దగిన కలికి.

సీ. వలరాజుచేతను • వసియించు రాచిల్క
భావజుప్రాదోంట • పసిడిమొల్క
గంధసింధురయాన • గంభీరములచాన
శరదిందుకళ మించు • చంద్రవదన
కరికుంభములం గేరు • ఘనకుచంబులసౌరు
పరిహసించు నళులం • గురులబారు
నీలోత్పలంబుల • నిందించుం గనుదోవి
మానినియధరమ • మ్మృతపుబావి
గీ. ఇంతి మదనునిచేతి పూ • బంతియేమొ!
బంతి కాదురా మెఱుముల • కాంతియేమొ!
కాంతి కాదు మరునిశర • దొంతియేమొ!
దొంతి కాదు భావజుం డెక్కు • దంతియేమొ?

ద్రౌప — వీనియాకారము సకలవికారముల కాస్పదము. కామాంధుండై యొడలెఱుంగఁడు.

కీచ — అదుగో! ఈజాఘవాణమ్మ నన్నుం గ్రీగంటం జూచుచు, నాయందు బద్ధానురాగత్వమును వెలిబుచ్చుచున్నది. ఈసింహబలుని సౌందర్యము సకలకాంతాజనమనోమోహనము, స్త్రీలు తమంతట మీఁదఁ బడువారు కారు. పలుకరించెద.

ఉ. ఎవ్వరిదానవే మగువ? • యెవ్వఁడు నాధుఁడు? దేశ మెద్ది? నీ

జవ్వన మేల సార్థముగఁ ♦ జాన! యొసర్వవు? నీదుదర్శనం
బెవ్వని మోహపాశముల ♦ నీడ్వదె? వేరని చూడనేల నన్?
నివ్వెరపాటు మాను నవ ♦ నీరజలోచన! నీకు దక్కితిన్.

ద్రౌప— ఛీ! నీసాహసము?

కీచ—క. విదలింతల సదలింతలఁ
పదపడి తన్నులవగచేఁ ♦ బడతులుపతులన్
మది మెచ్చి పూజ సేతురు
సుదతులు వశులైన సురత ♦ సుఖములు కొలయేఁ?

శ్రీకృష్ణుని కీరుచి సత్య యలవాటు చేసియేయున్నది.

ద్రౌప—నా కేవురు గంధర్వులు పతులు గలరు.

కీచ—సరే! నన్నారవవానిగా ననుగ్రహింపుము.

ద్రౌప—వారు మహావీరులు. వారివలన నీకుఁ బ్రాణహాని రాక మానదు.

కీచ—కోమలీ! ఇదియా నీసందేహము? వీఁ డెవఁ డనుకొంటివి? వీరాధివీరుఁడు- త్రిలోకమల్లుఁడు- సింహబలుఁ డని యెఱుఁగుము.

ద్రౌప—ఇంతపరాక్రమశాలివే! నీ కీచగుణంబు లేఁల? నేఁ బరపురుషులఁ గన్నెత్తి చూడనోప!

కీచ—నీవు మాటలకు స్వాధీన వగుదువా?

తెరలో— సైరంధ్రీ! దేవిగారు నీకై యెదురుచూచుచున్నారు. (ద్రౌపదిపోవుచున్నది. సుధేష్ణప్రవేశము. కీచకుఁడు కాళ్లఁబడుచున్నాఁడు)

సుధే—(భయముతో) తమ్ముఁడా! లెమ్ము; లెమ్ము! ఈబేలతన మేల? ఏమిచేటు వాటిల్లెను?

కీచ—అక్కా! నీచక్కి నొకచక్కరబొమ్మను జూచి చక్కెరవిలుకాని బారిఁ బడితి- నన్నేకరణి దానిప్రక్కకుఁ జేర్చెదవో!

సుధే—సైరంధ్రిని గాంచి వీఁడు కామపరవశుఁడై యుండనోపు. తమ్ముఁడా! పరదారఁ గోరతగునా? పాపహేతువు కాదా! పరకాంతా సంగమము ముప్పులకుఁ బుట్టినిల్లు.

సీ. ప్రాణేశుఁ జెఱఁగినఁ ♦ బ్రాణములకు హాని
మఱఁదులు చూచిన ♦ మానహాని
భూనాథుఁ డెఱిఁగిన ♦ భువిఁ బూజ్యతకు హాని
కులకాంత చూచిన ♦ గొప్పహాని
జలగాండ్రు గాంచిన ♦ సఖ్యతకే హాని
సరివారు చూచిన ♦ శౌర్యహాని
పురవార లెఱిఁగిన ♦ పూర్ణగౌరవహాని
కులగురుఁ డెఱిఁగిన ♦ గోత్రహాని

గీ· ఇట్టిఁపరకాంతకూటమి ♦ యేల ! నీకుఁ
గులము శీలము గోత్రము ♦ కూలు ననని
దేహదార్ఢ్యము దిగజాఱుఁ ♦ దేజ ముడుగు
సింధుగంభీర ! చెడకురా ! ♦ సింహబలుఁడ !

కీచ—అక్కా ! పరదారాసంగమమున వచ్చెడిదోషము రానిమ్ము. ఈ జలజనేత్ర నీగురుకుచము గూడకమాన. ప్రాయోపవేశుండనై నీపాదం బులదరిఁ జావనైనఁ జచ్చెదఁ గాని, యీసుందరిపొందు విడువనోప.

సుధే—వీఁడు కడు మూర్ఖుఁడు. తనకుఁ దోచదు. చెప్పిన వినఁడు. ఏమిచేయవలయు ? (ప్రకాశముగా) సింహబల ! నీగృహంబున కరుగుము. సురపేరుబెట్టి సైరంధ్రిని నీభవనమునకుఁ బంపెద. పిదప నీ యిష్టము.

కీచ—అక్కా ! బ్రతికించితివి. పోదునా ? (వెళ్లి తిరిగి వచ్చి) అప్పా ! మఱచెదవు సుమా !

సుధే—లేదు లేదు. నిశ్శంకఁ జనుము.

కీచ—(వెళ్లి తిరిగివచ్చి) పనిపాటలఁ బొరపడి కాలయాపనము జేసెదవు సుమా !

సుధే—సంశయ మేల ? పొమ్ము.

కీచ—(వెళ్లి మరల వచ్చి) ఆమెమాటల లోఁబడిపోయి జాగుచేసెద వేమో ?

సుధే — అట్లు కాదు. నామాట నమ్ముము.

(కీచకుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సుధే — అబ్బా! వీఁడిప్పుడల! సైరంధ్రీ! సైరంధ్రీ!

సైరం — (ప్రవేశించి) అమ్మా! ఏమి శెలవు?

సుధే — దాహమా మితిమీఱెను. నాలుక వెనుక కీడ్చుకపోవుచున్నది. ఇందునకు సుర దివ్యౌషధము. నాతమ్ముఁడు కీచకు నింట మంచి మదిర కలదు. తెచ్చి నాప్రాణము నిలుపుము.

సైరం — అమ్మా! ఇట్టి నీచపుఁబనులకు నన్ను నియోగింప వచ్చునా? కరుణించి మఱియొకరి నంపుము.

సుధే — ప్రాణావశిష్టను కాఁగా నాదాహము తీర్చుట నీకు నీచమా? ఏమి శ్రీరంగనీతి! నేఁ జచ్చిన నీ కేమి పట్టాభిషేక మగును?

సైరం — ఈమె తమ్మునిలోఁ గలసెనాయేమి? ఇఁక నేమిసేతు. అమ్మా! నీ కీకంటక మేల? నీయాజ్ఞచొప్పున సురఁ దెచ్చెద.

(తెగ పడును తెర ముందు సైరంధ్రి)

ఈమె సోదరునితో నేకమై నన్నుఁ బరిభవింపఁ దలఁచినది.

గీ. దయ సుధేష్ణకు లేదాయె, • దాహ మనుచుఁ
బంపు సురిపేరుబెట్టి యా • పాపికడకు
నీమె మ్లేచ్ఛ నాకింక • నేమిదారి
కంచ చేన్మేయ మఱివేలు • కాపు కలదె?

కీర్తన.

మానము గావుము - మనసిజజనక!
దానవ భంజన - దీనజనావన॥

పరుని గృహమును - జేరఁగఁ బోయెద।
చెఱఁబడి పోదునో - బిఱ బిఱ వత్తునో।
యుడిలోఁ బడకన్ - వరదుఁడ సరగునఁ।
జేర్చుము వీటికి - తరమె, పొగడ, పరమపురుష।
భూరమణ, ధీభరణ, శ్రీచరణ॥ మాన॥

శ్రీకృష్ణా ! నీసోదరి కీచకాలయమునఁ బ్రవేశించుచున్నది. మానభంగము గాకుండఁ గాపాడ నీదే భారము. అదుగో! యాదురాత్ముఁడు నా కెదురు వచ్చుచున్నాఁడు. (కీచకుఁ డట్టహాసముతో వచ్చును.) అన్నా ! మీయక్కగారు దాహపీడితులై సురఁ దెమ్మనిరి. కల్లు బోయింపుము. తడవైన ముప్పు వాటిల్లును.

కీచ—చకోరాక్షీ ! నీహృదయము నవనీతమువంటిది.

గీ. మగువ ! మాయక్క దాహము • మాట కేమి ?
నానుదాహము దీర్చవే • నాతిమిన్న !
మదిర బంపెద మఱియొక • మనిషిచేత
నిలువు మిచ్చటఁ బోనేల • నీరజాక్షి ?

సైరం—మదిర బోయింపుము. లేదా పోయెదను.

కీచ—కీచకుఁడు చేతఁ జిక్కినదానిని విడుచునా ? ఎక్కడికి పోయెదవు ?
(చెయ్యిపట్టి లాగును.)

సైరం—దీనబంధో ! దయామయా ! నందనందనా ! గోవిందా ! రక్షింపుము. (తప్పించుకొని పాఱిపోవఁ దలఁచుచున్నాఁడు.)

[భీముఁడు ప్రవేశించును]

భీము—ధ్వని- అట్లే యున్నది. సైరంధ్రియా ?

సైరం—హా కృష్ణా ! రక్షింపుము. (కీచకుఁడు తన్ని పాఱిపోవును.)

భీము—సైరంధ్రీ భయపడకుము.

శా. ఏరా నిల్వుము పాఱిపోకు తులువా ! • యీసాధ్వి యీచాన యీ
నారీరత్నము పాండుభూవిభుని.........

సైరం—అయ్యో ! ఇంకేమున్నది ? (భీముని నోరు మూసి) వంటలవానికి బాండవులజోలి యేల ?

భీము—నే నేమనుచుంటి ? ఎచ్చటనుంటి ? ఇచ్చటఁ జరులు లేరుకద !

సైరం—లేకేమి ! గోడలకుఁ జెవు లున్నవి.

భీము—సైరంధ్రీ ! నిన్ను దయావిహీనుఁడై తఱిమి తన్నిన నీచుఁ డెవఁడు ?

సైరం—విరటుని మఱఁది. కీచకాధముఁడు. కామపరవశత నన్నుఁ బట్టవచ్చినాఁడు. వీని మట్టుపెట్టవలయు.

భీము—అజ్ఞాతవాసమునఁ బన్నెండవమాసము జరుగుచున్నది. ఇప్పుడు సమయభంగము గాకుండ వీని రహస్యముగఁ జంపవలయు. వీఁడు మరల నిన్నరయుక మానఁడు. ప్రేమ నటించి నర్తనశాల కీరాత్రి వచ్చిన నీకార్యము దీర్చెదనని చెప్పి రప్పింపుము. అచ్చట వీనిఁ దెగటార్చెద. ఊఱడిల్లుము. పొమ్ము.

సైరం—నేఁటిరాత్రి యాకిరాతుని మరణమహోత్సవముఁ గన్నులారఁ జూచెదఁగాక.

రంగము పూర్తి.

## రెండవ యంకము—ఆఱవ రంగము.

### నర్తనశాల.

[భీముఁడు ముసుకుతోఁ పండుకొనియుండును. కీచకుఁడు చీకటిలోఁ దడుముచు]

కీచ—నే సేవించు వస్తువులు రెండు స్త్రీ యొకటి. రెండు సార. ఈ సురఁ ద్రాగలేక పనికిరాదని వ్రాసిరి. వారివ్రాతల కేమిగాని, యీ గాఢాంధకారమునఁ జొఱఁబడు టెట్లు? భయపడి యా సైరంధ్రి యిందుఁ బ్రవేశించెనో లేదో! (తడిమి పరున్న భీముని జూచి)

గీ. వనిత! ధన్యుఁడ నేను భూవలయమందు
తెచ్చినాఁడను నీకని ♦ దివ్యవస్తు
చయము, లేలెమ్ము చేకొమ్ము ♦ చంచలాక్షి!
నగలు రతనాలు చీరెలు ♦ నాతి! కొనుము.

(తల తడిమి) ఏమి! యీకేశముల బిరుసు.

సీ. అభ్యంగనముఁ జేసి ♦ యారఁ బెట్టితి వేమొ ?
బింబోష్ఠి ! కుఱులకే ♦ బిరుసు లేమి ?
(వళ్ళు నిమిరి) ఏమికాఠిన్యము !
సైరంధ్రివై సేవ ♦ జేయుటచే నొడల్
గరుకెక్కె నేమొ యీ ♦ కఠిన మేమి?
(చెయ్యి పట్టుకొన నొక్కును.) ఏమిసరసము !
కరము చేఁబట్టినఁ ♦ గంపించి భయపడి
పట్టినావేమొ యీ ♦ బలిమి యేమి ?
(కాలు తడుముఁ దన్నఁగా) ఏమి యీవిలాసము !
తమిమీఱ ధవళాక్షి ! ♦ తన్నినఁ దన్ననో
యెలనాగ ! పడఁదన్న ♦ నేమిసరళి ?

గీ. సరసమో వినోదవిలాస ♦ సారమో ! య
తిశయమో కోపమో ! నీకుఁ ♦ దెలియదాయె
చేయనేటికి విపరీత ♦ చేష్ట లతివ !
కాంచనిప్పుడు నీచర్య ♦ గాఢవిషము.

(భీముఁడు గ్రుద్దగా)

అబ్బా ! ఇదేమి వింత ! సరసమాడుట యన్నఁ దన్నులు గ్రుద్దులునా ? చకోరాక్షీ ! నీవాగంధర్వుల వీటిచేతనే మెప్పింతువా ?

భీము — సీ. గంధర్వ యక్షులు ♦ కాలితాపులు తిని
కూలిరి ధరపైనఁ ♦ గొట్టుకొలది
బకుఁడు హిడింబుఁడు ♦ పాదతాడనములఁ
బ్రాణముల్ విడచిరి ♦ బలము లుడిగి.
కిమ్మీరదైత్యుఁడు ♦ కేల గ్రుద్దిన నేలఁ
బడి చచ్చె నబ్బుర ♦ పాటు జెంది
యలజరాసంధుఁడు ♦ హూతుఁ డయ్యెఁ దన్నులఁ
జలికిలఁ బడి లేవ ♦ జవము లేక

గీ. వారికన్నను హెచ్చైన ♦ వాఁడ నగుట
సరసముగఁ దమ్ముఁ దన్నెద ♦ సార మేఁకె?
నిలచి నన్గూడి ప్రాణము ♦ నిలుపుకొనుము
సరసుఁడా! రమ్ము నీమీఁద ♦ చాల మనసు.

కీచ——మోసము- మోసము. వీఁడు గంధర్వుఁడా? భీముఁడా?

భీము——నన్నొక్కసారి తనివిదీరఁ గౌఁగలింపుము. నీకోరికలు తుద ముట్టును.

(కీచకుని పట్టి నలిమి చంపును.)

రంగము పూర్తి.

అంకము సమాప్తము.





శ్రీ రామా.

# సంపూర్ణ మహాభారతము.

## మూఁడవ యంకము — మొదటిరంగము.

దుర్యోధనుని పడకటియిల్లు.

[హరిదాసు ప్రవేశము.)

హరిదాసు— కీర్తన.

ఏహి వనమాలి కృష్ణా! కృష్ణా! ॥ఏహి॥
శరణాభరణా, శ్యామలవర్ణా ॥ కృష్ణా, కృష్ణా,
కృష్ణా, కృష్ణ శ్రీకృష్ణ॥

1 దీనదయాపర - తాండవకృష్ణా
మోహనశ్రీముగిహారే॥
దేవ దేవ హే మాధవ శ్రీధర
దానవవైరి శ్రీరమానాథా ॥ఏహి॥

2. కాళియమర్దన - కంసవిచ్ఛేదన
కేశవ శ్రీకరా హరే
కామరూప హే - కారుణ్యాంబుధే
గానలోల గోపికాలోల ॥ఏహి॥

నాస్తికసామ్రాజ్యమా! ఇది కాలము! నీప్రభ దివిటీయై వెలుగుచున్నది. రారాజులు నీకు దాసులైరి సేనాధిపతులు నీకుఁ

గింకరు లెరి. ఉన్నతోద్యోగులు నీకు సేవకు లెరి. భూనాథుల మందిరంబుల, భూసురుల గృహద్వారముల, వణిక్శ్రేష్ఠుల హర్మ్యముల, శూద్రప్రభువుల సర్వాంగముల నీమూర్తి తాండవమాడుచున్నది. ఈసుయోధనచక్రవర్తికి యెట్టిచేటుకాలమో! తాను నాస్తికుఁ డగుట సరే. బంధుమిత్రపరిచారకులసహితము నాస్తికమార్గములఁబట్టుదలతో నడపించునట. శ్రీకృష్ణభగవానులఁ బ్రేమయెట్టిదో! అజ్ఞాతవాసమును బూర్తిచేసిన పాండవులకడ కేగి యభిమన్యకుమారునకు విరటపుత్రిక నిచ్చి వివాహము చేయించి వచ్చిన నారాయణుఁడు, నన్నుఁ జూచి యిట్లాజ్ఞాపించె. సుయోధనుఁడు తాఁ జెడుటేగాకఁ బరులఁ జెడఁగొట్టుచున్నాఁడు. నీవు కరిపురమున కేగి సకలజనులకు నాయందు భక్తి విస్తరిల్లునటులఁ జేయుమని పంపె.

[దాసురాలు ప్రవేశము.]

దాసు—ఓహో! హరిదాసుగారా? అడియేన్! అడియేన్!

హరి—దాసురాలికి స్వాగతము.

దాసు—ఎచ్చటనుండి మీరిచ్చటికి విజయము చేసితిరి?

హరి—ద్వారకానగరమునుండి.

దాసు—మీపాదపద్మముల కిదే వందనములు_ ద్వారకనుండియా! కంసమర్దనునకు క్షేమమా? రుక్మిణీమదంబకుఁ గుశలమా?

హరి—అజ్ఞాతవాసమును దీర్చిన పాండవులఁ గలసి మెలసి రుక్మిణీకాంతుడతిశయానందభరితుఁడై యున్నాఁడు.

దాసు—ఉత్తరగోగ్రహణంబునఁ జావుదప్పి కన్నులొట్టబోయిన దుర్యోధనుఁడు మరలఁ గృష్ణదర్శనార్థము ద్వారావతి కేల వచ్చెనో?

హరి—జరుగఁబోవు భారతయుద్ధమునఁ దనకు సహాయము రమ్మని కృష్ణుని బ్రార్థించుటకు.

దాసు—ఈనాస్తికునకు దైవసహాయ ముండునా?

హరి—అంతకుముందె యందునిమిత్తము వచ్చియున్న యర్జునుఁడు సుయోధనుఁ డేకకాలమున భగవంతుని సందర్శించిరి.

దాసు— శ్రీకృష్ణభగవానుల కెట్టియభేదభావము. నాగకేతనుఁడు శ్రీ
కృష్ణుని ద్వేషించి సదా నొవ్వినాడు. దర్శనం బెట్లు లభించెనో ?

హరి—దర్శనమే కాదు. యాదవసైన్యం బంతియు సహాయ మిచ్చె.

దాసు—ఏమివాత్సల్యత ? అర్జునకో ?

హరి—ఆయుధముపట్టని తన్నుఁ గాని, యాదవసైన్యమును గాని కో
రుకొమ్మన, దుర్యోధనుఁడు సైన్యము గోరుకొనెను. నిరాయుధుఁ
డైన హరిని యర్జునుఁడు కోరెను.

దాసు—ఓసీ ! మూర్ఖా ! దుర్యోధన ! సకలలోకేశ్వరున కాయుధము
లేలరా ! నీవు దైవోపహతుఁడ వైతివి. హరిదాసుగారు ! మీరాక
యెందులకు ?

హరి—అంతఃపురపరిచారకులకుఁ గృష్ణునిపై భక్తి బోధించుటకు. నేను
పురుషుల మార్చెద. నీవు స్త్రీల శోధింపుము. ఇది కృష్ణునియాజ్ఞ.

[దుర్యోధనుఁడు ప్రవేశము]

అదుగో ! రాజు వచ్చుచున్నాఁడు. నే పోయెదను.

(దుర్యోధనుఁడు శయ్యపై నుండును. దాసురాలు కాళ్ళొత్తుచుండును)

దాసు—ఈనీచసేవ నాకుఁ దప్పినది కాదు.

దుర్యో—

చ. జలములఁ ద్రోసితిన్ విషము • చావఁగఁ బెట్టితిఁ గొంపపై దవా
నలమును వేసి కాల్చితిని • నామది మెచ్చిన జూదగాండ్రచే
గెలిచితి రాజ్యలక్ష్మి వనికిం జన గెంటితిఁ జావరయ్యె తాఁ
దలచినకార్య మొక్కటి విధాత తలంపు మఱొక్కటయ్యెగా.

దాసు—అయ్యో !

గీ. అడవిలో నున్నఁ బ్రతుకును • హాయిగాను
దైవము సహాయ ముండిన • ధర జనుండు
దైవహతుఁడైనఁ జచ్చును • దప్పకుండఁ
గాపుఁబెట్టినఁ జుట్టును • గ్రమ్ముకొన్న.

దుర్యో—(అదరిపడి లేచి) దాసీ ! పురుషప్రయత్నము వ్యర్థ మనియా

నీయభిప్రాయము ?

దాసు — శ్రీకృష్ణభగవానుని ప్రసాదము లేకఁ బురుషప్రయత్నము కొనసాగునా ?

దుర్యో—ఓసీ ! దేవదాసీ ! కృష్ణుని దైవమని పొగడుచున్నావు. వల్లవకాంతల జారుఁడు - వెన్నమీఁగడల చోరుఁడు - కులగోత్రములు లేని యవినీతుఁడు - వీఁడా దేవుఁడు ?

దాసు — చతుస్సముద్రముద్రితభూవలయము నేలెడి చక్రవర్తివి నీవెఱుఁగనిది కలదా ?

సీ పాలతోఁ బూతన ♦ ప్రాణముల్ పీల్చిన
ప్రబలబలాఢ్యుఁడా ♦ బాలుఁ డితఁడు.
కాళింగుఫణములఁ ♦ గాలూని చకఁజకఁ
దాండవమాడిన ♦ తండ్రి యితఁడు.
సౌభపురవిభుఁడు ♦ సాళ్వునిఁ జంపిన
దనుజమర్దనచక్ర ♦ ధారి యితఁడు.
శిఖబట్టి కంసుని ♦ సింహాసనమునుండి
పడనీడ్చినట్టి యా ♦ బలుఁ డితండు.
గీ: పంచశరవయస్కుఁడగుచుఁ ♦ బంచబాణ
వశల వల్లవకాంతల ♦ వలచె నితఁడు
పారిజాతము గొనివచ్చి ♦ భామ కిచ్చి
సత్య మెప్పుల కిరువైన ♦ సరసుఁ డితఁడు.

దుర్యో—ఓసీ రాకాసీ! ఈశ్వరుఁడు సర్వవ్యాపి యనుమాట యెఱుఁగుదువా ?

దాసు—రాజేంద్ర ! కృష్ణుఁడు సర్వవ్యాపకుఁడు. సర్వజ్ఞుఁడు. సర్వశక్తుఁడు.

దుర్యో—రండా ! వా డిందుఁ గలఁడా ? చూపెదవా ?

దాసు—సంశయ మేల ? నాకంబుపై దానవులు దండెత్తినపుడు దేవతలు మొఱలిడఁ బరుగున రాఁడా ? మకరిచేఁ బట్టువడి కావుమని కరి

వేఁడ పరుగెత్తఁడా? అయిదేళ్లబాలకుని హిరణ్యకశ్యపుఁడు హాని జూపుచుని ధిక్కరింప స్థంభము బ్రద్దలుచేసుకొని వెడలఁడా! మొన్న నీవు నిర్దయుఁడవై ద్రౌపదీమహాదేవిగారిని సభకు రావించి చీర లొలిపింప గోవిందా యని కేకవేసినమాత్రాన యక్షయములగు వలువలు ప్రసాదింపఁడా? అట్టిజగద్వ్యాపకుఁడు నే డెందు లేఁడని వాదించగలనా? సకలచరాచరముల నిండి నారాయణుఁడు నాకన్నులఁ గాన్పించుచున్నాఁడు.

దుర్యో—ఓసీ! రాజద్రోహి! నీనాలుక యీకరవాలముచే నూఱు వ్రయ్యలు చేసినగాని నీప్రేలుడు మానవు.

(మీదకుఁ బోవుచుండ కృష్ణుఁడు ప్రవేశము.)

కృష్ణు—బావా! ఏమిచేయుచుంటివి?

దాసు— కీర్తన.

సంధితఖగతురంగా! మోహనాంగ! భవభంగా!
శ్రీపాదజగంగతరంగ ॥సం॥

1. గానలోల దరిగాన జగాన-దీనురాల గతి నీవనుదాన,
నవజభవోదిరరంగ శ్రీరంగ హేరంగ
పాదజగంగతరంగ ॥సం॥

2. సిరిలేనిభూపతు లెడ నీరజాక్ష నిను గాంచుటయెట
మరి మరి వేఁడగ నేల గోపాల రావేల నీవని
నమ్మితిరావా ॥సం॥

దానవాంతక! ముచుకుందవరద! మాంపాహిమాంపాహి!

దుర్యో—బావా! నీరాకయెచ్చటినుండి?

కృష్ణు—ధర్మజుడంప రాయబారము నకు వచ్చితి.

దుర్యో—దాసి! నీవు చని మావారినందఱ బిలుచుకరమ్ము. బావా! పాండవులకు క్షేమమా?

కృష్ణు—అందఱు కుశలముగ నుపప్లవమున నున్నారు.

దుర్యో—సభకుఁ బోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

సభ — రాయబారము.

[ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ కర్ణులు మొదలుగా సందఱు ప్రవేశము.]

కృష్ణ—బ్రాహ్మణోత్తములకు వందనము. కురువృద్ధుల కభివాదనము. అంబికేయ ! నా రాయబారపర్యవసానము వినుదువా ?

గీ. బంధునాశము గాకుండ • బవర ముడిగి
యిరుతెరంగులవారు న • మేకముగను
మనుట మేలు కాతలచి యా • మ్రాద్రివిభుని
పాలు గోరెద రార్యులు • పాండుసుతులు.

గీ. వారి పాలు వారి కొసగి • వారు వీరు
పాలునీరములవలె నే • పార కెపుడు
మనుట శ్రేయస్కరము గాదె • మహితలేంద్ర.
యన్నదమ్ముల కొట్లాట • యాపఁదగదె.

సకలకష్టముల నోర్చి వనవాసాజ్ఞాతదీక్షల నెరపి శాంతశూరుల గు పాండవులు తమతండ్రిపాలు కోరుచున్నారు. అజాతశత్రుం డైదుగ్రామముల నిచ్చినఁ జాలునని విగతతృష్ణుఁడై యున్నాఁడు. సంధి యొనరించి కయ్యఁ ముడుగుట యిరువాగుల వారికి శ్రేయోదాయకము.

ఉ. వారిజనేత్రతో విపిన • వాసము జేయరె, నీచసేవకై
వారితతేజులై విరటు • వానను జేరరె పాండునందనుల్
భారముదోచదా ? సుతులు • పంచలఁ బట్టిన, భాగమున్న దో
భారము దోచెనే మదికి ? • భారతవంశచకోరచంద్రమా !

గీ. పుత్రమోహముచేతఁ • బుడమిఱేఁడు
పలుకకున్నాఁడు మీరేలఁ • బలుకరయ్య
భరతభూమిని పాపము • పండలేదు
జ్ఞానభాస్కరుఁ డస్తాద్రి • జారలేదు.

భీష్మ—పాండుసంజాతులకుఁ దమ తండ్రిపాలు కోరుట సముచితము. వారిభాగము వారి కిచ్చి మనుట సుఖకరము.

దుర్యో—పాండునందనులకు భయపడియా! లేక నీ వెఱ్ఱిగొల్లనికి విందు చేయుటకా? పాండుసుతుల యందుఁ గలపక్షపాతబుద్ధితోఁ దమకుఁ దోచినట్లు చెప్పిన మాత్రమున తాతతండ్రుల నుండి నాకు సంక్రమించిన భూమి పంచి యిచ్చువాఁడనా? సూదిమొనమోపినంత నేల గాని యివ్వనొల్ల.

కృష్ణు—

శా. గాండీవంబును జేతఁబూని నరుఁ డీ • గాంగేయ కుంభోద్భవుల్,
నిండారం గనుచుండ నాజినడువన్ • నిశ్శంకభీమగదా
దండంబున్ ఝళిపింపఁ జూచి నపుడే • తద్రాజ్యభాగంబు నీ
కుండన్ లిచ్చెద వేమొ కాంచెదను నే • నుగ్రాహవంబందునన్.

దుర్యో—కృష్ణా! రాజనీతి తెలియని వాఁడవు తెలియనట్లూరకుండవేమి! యుద్ధమపేక్షించితివి గాని సంధిఁయొనర్ప వచ్చిన వాఁడవు కావు. రాయబారికి ధర్మము సంధి సమకూర్చుటె! అర్జునుని గాండీవమును, భీముని గదాదండమును, నీ చక్రాయుధమును జూచి మఱయుచుంటివా? మాకవి తృణప్రాయములు. వంశక్రమంబున నాకు రానున్న యీరాజ్యరమను పాండవు లపేక్షించుట రాజనీతికి విరుద్ధము. యుద్ధమే ప్రధానము. భార్గవశిష్యుఁడు కర్ణుఁడు భీష్మార్జునులఁ దలపడిన దారతమ్యముల నీవే కనుగొందువు.

కృష్ణు—సుయోధనుఁడు బంధునాశము గోరుచున్నాఁడు. కులాంతకుఁడగు వీనిఁ గంసుని వడువున వధించి కులము రక్షించుకొనుట మంచిది.

దుర్యో—అన్నా! కృష్ణుఁడు భీష్మాదులఁ గలసి నిన్ను బంధించునట్లున్నది. ఆత్మరక్షణము గర్తవ్యము.

దుర్యో—కృష్ణుని బంధించితిమా కోరలులేని పాములవలెఁ బాండవులు చిక్కెదరు.

(చప్పట్లు కొట్టును. పగ్గములతో భటులు ప్రవేశింతురు.)

కృష్ణు—ఔరా! దుర్యోధన! నీమదాంధత. నేనొంటిగా నుంటినని

నన్ను బంధించఁ జూచెదవా ? నాజంటబాయక నన్నంటియుండు పోటుబంటు లెందఱుండిరో కనుము.

సీ. ధర్మంబు ముఖ్యమౌ • ధర్మతనూజుండు
నా వెంట లేఁడని • నమ్మినావొ ?
మోహాన యోధుఁడు • యుద్ధార్థి పార్థుండు
నా వెంట లేఁడని • నమ్మినావొ ?
గదబూని నీతొడల్ • కాంక్షించు భీముఁడు
నా వెంట లేఁడని • నమ్మినావొ ?
మానిత ధైర్యులు • మాద్రికుమారులు
నా వెంట లేరని • నమ్మినావొ ?
గీ. యొంటినున్నాఁడు బంధింప • నొనరుదిక్క-
నంచు విఱ్ఱవీగెదె మూర్ఖ ! • యమిత బలులు
జంటఁ బాయక నా వెంట • నంటియున్న
వీరవరులను జూడు • వివేక రహిత.

(విశ్వరూప సందర్శనము.)

దుర్యో—హా ! వనిగారడి ! ఇదే యితనిశిక్ష విద్య,
ధృతరాష్ట్రుఁడు—(నేత్రములు రాగా)

చం. కిరాతకన్యకా ధర్షణ • కీర వేదవేద్యయో
సరోజనేత్ర ! ఘోర దోష • సాగరంబు నీదజా
ల రావె కావవే మురారి ! • లక్ష్మణాగ్రజా హరీ !
పరాకు పక్షివాహనా ! క్షమ • పాహిపాహి వేడెదన్.

దేవా ! నిన్ను గాంచినపిదప నన్యముఁ జూడనోప. నాకెప్పటి యట్లంధత్వ మనుగ్రహింపుము.

(విశ్వరూప మదృశ్యమగును.)

కృష్ణు—రాజేంద్ర ! నీకుమారుఁడు విననేర్చినవాఁడు కాఁడు.

ఉ. గర్వముచేత నీ సుతుఁడు • గానఁడు వచ్చెడిచేటు మూర్ఖతన్
సర్వసమానసౌహృదయుఁడవు • సంధి యొనర్పవు పుత్రమోహివై

సర్వవినాశహేతువగు • సంగర మాపనశక్య మింక ని
ర్గర్వులు పాండునందను లఖండవిశేషవిభూతి నందరే.

యుద్ధము తప్పదు. నేఁ బోయి వచ్చెద. కర్ణా! నన్నంపుటకు నావెంట రమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

కృష్ణు—అంగరాజా! నీకొక రహస్యము జెప్పెద వినుము.

గీ. సూర్యు నర్చించి కన్నది • సుతుని నిన్నుఁ
గుంతిభోజుని గూతురు • గొంతి నాఁడు

కర్ణు—హా! ఏమి!

కృష్ణు—(తిరిగి సూర్యునర్చించి యని చదువుచున్నాఁడు.)

కర్ణు—అయ్యో! ఎంతపని! యెంతపని!

కృష్ణు—గీ. సూతసుతుఁడవు కావయ్య • సూర్యపుత్ర!
కుంతి తొలుదొల్తఁ గన్నట్టి • కొడుక వీవ.

కర్ణు—శ్రీకృష్ణ! యిదివర కేలఁ జెప్పవైతివి? సర్వజ్ఞుండవగు భగవానుఁడా! న న్నేగతికిఁ దెచ్చితివి? స్వచ్ఛమగు క్షత్రియునకు శూద్రత్వము కల్పించితివే? కుంతీ! యీదోషమంత నీదే: పుత్రవాత్సల్యత నీ కేఁల నాఁడు కలుగదయ్యె? అబ్బా! హృదయమా! బ్రద్దలు గాకుము.

సీ. ధర్మంబు దప్పఁడన్ • ఘనకీర్తికలవాఁడు
తమ్ముండు నాకట • ధర్మజుండు
కాలకంధరు మెప్పు • గాంచిన ఘనమేటి
యనుజన్ముఁ డట నాకు • నర్జునుండు
కిమ్మీరబకదైత్య • కీచకాంతకభీముఁ
డనుజుఁడు నాకట • యధికబలుడు
పరమసాధ్వీమణి • పాంచాలి గాదిలి
మఱఁదలు నాకట • మాన్యచరిత

గీ. కవలు కడసారి తమ్ములు • కర్మమేమొ
కర్మభ్రష్టతఁ గాలముఁ • గడపవలసె

కులము గోత్రము రాజ్యము ♦ గోలుపోతి
దొడ్డసోదరులకుఁ గడు ♦ దూరమైతి.

కృష్ణు—సూర్యనందనా! గలించినదానికై వగచిన ఫలమేమి? ఇప్పుడు మించిన దేమి? నావెంట ధర్మజుకడకు రమ్ము. నిన్ను రాజుఁగావించెద. పాండవులచే నీకూడిగము చేయించెద. పాంచాలి నిన్నారవవానిగా వరింపఁ జేసెద.

కర్ణు—సకలభువనాధీశ్వరుఁడవగు సర్వేశ్వరునకు నీ సాధ్య ముండునా? శ్రీమన్నారాయణా! నావిన్నప మాలింపుము. నిష్కల్మషుఁడగు యుధిష్ఠిరునకు జయము తప్పదు. దేవాదిదేవుఁడవు నీసహాయ ముండ జయమున కేమి కొరత? కాని.

ఉ. పెంచినవాఁడు నన్నుఁ గఁడుఁ ♦ బ్రీతిని సూతుఁడు కన్నబిడ్డగాఁ
బెంచినదయ్య రాధ పుడ ♦ మీశ్వరుఁ డీకురురాజు నన్ను రా
జంచును బిల్చినాఁడు తన ♦ యాశలు నాపయిఁ బెట్టి యుద్ధమున్
బెంచినవాఁడు నే విడచి ♦ పెట్టిన నిప్పుడు నవ్వరే జనుల్.

కన్నబిడ్డకన్న మిన్నగాఁ బెంచిన రాధాసూతులను, నన్ను నమ్మి యుద్ధభారము వహింపనున్నఁ గురురాజును, విడుచుట ధర్మము కాదు. పుణ్యభూమియగు కురుక్షేత్ర మనుయజ్ఞవాటిని నీవు యుపద్రష్టగాఁ బాండవులు ఋత్విజులుగాఁ గురుకుమారవినాశమను యజ్ఞము జరుగుఁగాక. అందు నిహతుండనై యూర్ధ్వలోకమున నిన్ను, గలఁయు నా కనుగ్రహింపుము.

కృష్ణు—పాండవాగ్రజా! నిర్మలాంతఃకరుణుండవు_ దానపరుండవు_ నీ కోరిక సిద్ధించుగాత_ నేటి కెనిమిదవనా డమావాశ్యదినంబున యుద్ధ ప్రారంభము. నే పోయివచ్చెద.

(నిష్క్రమింతురు)

రంగము పూర్తి.

## మూఁడవ యంకము—రెండవ రంగము.

### కురుక్షేత్రము.

[కృష్ణార్జునులు రథములపైఁ బ్రవేశింతురు.]

కృష్ణు—అర్జునా! ఇరుతెగలఁ బదునెనిమిది యక్షౌహిణీవీరవరుల వీక్షింపుము. నీదోర్బలమహిమలకుఁ దగిన యదను సంప్రాప్తమైనది.

అర్జు—బావా! ఇరువాగులందున్నవారు గురువులు, గురుపుత్రులు, కొడుకులు, మామలు. వీరిని జంపిన ఫల మేమి? గాండీవము నా చేతినుండి దిగఁజారుచున్నది. ఒడలు కంపించుచున్నది. బంధుమిత్రాదుల గూల్చు నీబవర మేల? హృషీకేశా!

సీ. అమరనదీసుతు • నాహవమందున
నమ్ముల నేవిధి • నాదరింతు?
గురువుల నేరీతిఁ • గోలల నొప్పింతు?
గురుపుత్రు నెట్లు నేఁ • గొట్టనేర్తుఁ?
గరముల నేసుని • కృపు నేతు శరములఁ
గృతవర్మ కేనెట్లు • ఘాతఁ జేతు?
నన్నదమ్ముల నెల్ల • నాశీవిషోపమ
శరముల నెట్లుగాఁ • జంపనగును?

గీ. రాజ్యకాంక్షకు లోఁబడి • రాజనీతి
పేరుబెట్టి బంధుజనులఁ • బ్రేమ లేకఁ
జంప నొల్లను, రణము జా • లింపవయ్య!
కరుణ బూనుము దారుణ • కర్మ మేల?

కృష్ణు—భారతీయుఁడా! చచ్చువాఁడు చంపెడివాఁడు కలఁడా?

“శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥

గీ. పాతబట్టల విడనాడి ♦ నూత్న వస్త్ర
ధారణము జేయుభాతి నీ ♦ తనువు విడచి
వేరుదేహము నొందుచు ♦ మారువాడు
కాడు జీవాత్మ నిత్యుడై ♦ కానుపించు.

ఆత్మ నశించునది కాదు. శస్త్రాస్త్రములచే ఛేదింపబడదు. దవానలముచే దగ్ధము కాదు. ప్రచండమారుతమునకు జలింపదు. మహోదధిజలంబులకేని దడుపబడదు. అట్టి నిత్యపదార్థమునకై యీకారుణ్య మేల ? నీ స్వధర్మము నెరవేర్చుము. సర్వ మాయత్తమై యుండ గార్యముఖమున నిల్చు వెనుకదీయుట క్షాత్రధర్మము కాదు.

అర్జు—యోధులు కూలుదురు. సత్కులములు నశించు. హీనకులసంజాతులు ప్రబలెదరు. భారతమాతమ్లేచ్ఛాధీనమై విలపించు - క్షత్రియశూన్యముకాగా రక్షకులులేక స్వాతంత్ర్యమడుగంటు. ఇంతకన్న కష్టమేమున్నది !

కృష్ణు—మార్పులదెచ్చునది కాలము. కాలకర్మములేకమై యుగములు గల్పించు రానున్నదికలికాలము. కాలగతినెవరు మార్పగలరు. గుడాకేశా ! కర్మఫలదాయకుండనగు నాయందు కర్తృత్వభోక్తృత్వములనర్పించి సకలకర్మఫలాపేక్షల పరిత్యజించి నన్ను శరణుజొచ్చినవారికి బంధనము కలుగదు. ఇదే కర్మసన్యాసమను రహస్యము. సకలమునకు నేను హేతుభూతుండ. నీవాకారణము.

అర్జు—దేవా ! ప్రత్యక్షమున రణమొనర్చి బంధుమిత్రాదుల నేజంపుచుండ గర్తనేనగుదుగాని నీవెట్లగుదువు ?

కృష్ణు—నాదగు వైశ్వానరరూపముగాంచినగాని నీసంశయముదీరదు. దివ్యదృష్టినొసగితి గనుము. (విశ్వరూప సందర్శనము)

అర్జు—(మోకరించుకొని)

గీ:-కోటిసూర్య ప్రభలమించి ♦ కోట్ల కొలది
శిరము లురములు బాహులు ♦ శిఖిశిఖాళి

గ్రీష్మ వక్త్ర సహస్రము • గలిగి మ్రింగు
చున్నది సుయోధనాదులఁ • జూడనోప.

ఇట్టి ఘోరాకారము జూడనశక్యము. దేవా ! నీ దివ్యమంగళరూప
సందర్శనమిమ్ము (విశ్వరూపము మారును)

కృష్ణు—
శ్లోకము.

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణంతథాన్యానపి యోధ వీరాన్
మయాహతాంస్త్వంజహిమావ్యథిష్ఠా యుధ్యస్వజేతాసి రణే సప
త్నాన్॥

పాండవమధ్యమా ! నీవు కాంచినది నాస్వరూపమే. భీష్మద్రోణకర్ణ
సుయోధనాది వీరులిదివరకే గతప్రాణులు. సకలరాజానీక మిదివరకే
చచ్చినది. నీవు నిమిత్తమాత్రుండవై స్వధర్మము నడపి క్షాత్రము
నిలుపుకొనుము. చేసినప్రతిజ్ఞల నిలుపుము. దివ్యాస్త్రములఁ బడ
సిన ఫల మందుము.

అర్జు—నీయాజ్ఞ నుల్లంఘింప నెవనితరము.

కృష్ణు—మధ్యందిన మార్తాండుని వలెఁ దీండ్రించుచు భీష్మభానుఁడు
భండనాంగణమున నీకభిముఖుఁడగుచున్నాఁడు. గాండీవ మెక్కుబెట్టి సం
సిద్ధుఁడవుకమ్ము.

(భీష్ముఁడు ప్రవేశము.)

భీష్మ—

ఉ. పోకుముభీము, పోవలదు • భూరి బలాఢ్యుఁడ భీమపుత్ర, పోఁ
బోకుము నిల్వు మాద్రిసుత • భూపతిపుత్రక రాకుమార, నా
రాకనుగాంచినంతటనె • రాజులు మీరలు బారన్యాయమే
ప్రాకట ధైర్యశాలి రణ • పార్థుఁడు యోధుఁడులేఁడె యిచ్చటన్.

రణకోవిదులగు నో ధనుర్ధరులారా ! పాండవయోధులారా !
పాఱిపోయెద రేల ?

ఉ. భండనకోవిదుండు ధర • భారముదీర్పగవచ్చినట్టి కో
దండధరుండు, శ్రీయుతుఁడు • దాగునె పాండవమధ్యముండు భూ

మండలమంత యేకమయి • మార్కొన భీష్మను యోధవీరుఁడా
ఖండలసూనుఁ డేమి ? శర • కాండముచేసని ముంచి తేల్చెదన్.

అర్జు—కృష్ణా ! దేవవ్రతుఁడు నాకై వెతుకుచున్నాఁడు. మనరథమభి
ముఖముగా నడుపుము.

కృష్ణు—మందాకినీనందనుని శరవిన్యాసము. వీని శరాహతిచే మేస్వే
డంక ముట్టెలువంచి గిట్టలనేలఁదాపి రణఖేలన హేషలుమాని చట్టల
సందున వాలములు ముడిచి పుల్కుపుల్కు మనినన్నుఁజూచు గాని
యీగుఱ్ఱములుముందు సాగకున్నవి. అర్జునుఁడో భీష్మకరముక్త
శరాళికి మేనుగంద మోమరవంచి శత్రుధిక్కారముల సహించి
యూరకున్నాఁడు. వివత్సుఁడు నిరుత్సాహుఁడుకాగానే నూరకుం
డిన జయమెట్లు లభించు. నాచక్రమునకు వీరలబలిఁబెట్టెద.

ఉ. భీష్మునిఁజంపి శంభజుని • బీచమడంచి సయోధనాధమున్
భీష్మునితోడఁబంపి రణ•భీకరుఁ గర్ణుని నేలఁగూల్చి యీ
భీష్ముని దారుణోత్సవము • బెంపడగించెదఁ జక్రధారలన్
యుష్మకరుండు చీకటుల • నొంచిన రీతిని నొంతు శత్రులన్.

(చక్ర మెత్తి రథము దిగి రాఁగా)

భీష్మ—నీవు వచ్చిన మేలె. నీలవర్ణా ! రమ్ము రమ్ము ! నీమీద భక్తి
చే బవర మిచ్చెదను. భీష్ముఁడు పాఱిపోవునా ?

అర్జు—(కృష్ణుని వెంబడించి పట్టుకొని)

గీ. అస్త్రసన్యాసమును జేసి • యనురదమన !
చక్రమునుబట్ట ధర్మమే ! • శక్రవినుత !
నీవె వీరలఁగూల్చిన • నీలవర్ణ !
పుట్టనేటికె పార్థుఁడు • పుడమిమీద.

వారిజసంభవ వాసవాదులు నిన్ను దలపడఁ జాలకుండగ నీభీ
ష్ముఁడు నిన్నుఁ దార్కొనుట కెంతవాఁడు ? వీరి వినాశమునకు
నేను సాధనమంటివే. అస్త్రము బట్టనంటివే ?

కృష్ణు—శిఖండిని ముందిడికొని నీవు రణముచేయుకున్న భీష్మభానుం

ౘస్తమించవఁడు. పోదము రమ్ము.　　(నిష్క్రమింతురు)

[దుర్యోధనాదులు ప్రవేశము.]

దుర్యో—గీ. మేలు మేలు యోగాంగేయ • మేలు మేలు
తరము నిన్ దాకినోర్వంగ • ధాత కైనఁ
బాఱిపోయెను పార్థుఁడు • వందపగిదిఁ
బరమ సుఖమాయె నానంద • భరితమాయె

పితామహా! సూర్యుఁ డస్తంగతుఁడగు చున్నాఁడు. నేటికి బవరము చాలింపుము.

(నిష్క్రమింతురు)

రంగము పూర్తి.

## మూఁడవ యంకము — మూఁడవరంగము.

---

### పద్మవ్యూహము.

[దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, సైంధవుఁడు మొదలగువారు ప్రవేశము.]

దుర్యో—గీ. భీష్మభాముఁడు క్రుంకినఁ • బిదప నిన్ను
సర్వసేనాధిపతిఁ జేసి • సంతసించి
గురువరా! నమ్మి మానముఁ • గోలుపోతి
పంతమాఱెను ధర్మజుఁ • బట్టవేమి?

ఇచ్చినవరము మరచుటచచ్చుటకంటె హీనమని సచ్చరితులు చెప్పెదరు.

ఉ. పాండవపక్షపాత మటఁ • బారఁగఁ దోలి యపాండవంబుగాఁ
దాండవమాడి యుద్ధవని • ధర్మజుఁ బట్టితి వేని మేలు; యా
కాండవదగ్ధుకై భయద • కంపితదేహుఁడ వైతి వాసరో
ద్దండమునందు నీయశము • లంతము నొందవె, పేరు పోవదే?

గురుతిలకా! మీరు యుద్ధ మారంభించి రెండురోజు లైనది. యుధిష్ఠిరుని బట్టుకొనరైతిరి. చేసినబ్రతిన మరచితిరా?

ద్రోణు—కౌరవేశ్వరా! అర్జునునకు సంగరము గల్పింప సంశప్తకుల నియోగింపుము. పరమేశ్వరుని గెల్చి పాశుపత మందినపార్థుడు కాచియుండ నజాతశత్రుడు జిక్కునా! సమరం బీరోజునఁ జాతుర్యముగాక- పన్నినది పద్మవ్యూహము

ఉ. వ్యూహము పద్మనామకము ♦ యుద్ధముఁజూడుము నేడు రాజ యీ మోహరమందుఁ జొచ్చు నర♦పుంగవు గాన నరుండుఁ దక్క ఘోరాహవకేళి వాని నట ♦ నాపినఁ బట్టెద ధర్మసూతినిన్ వ్యూహము లెన్నొ పన్ని సుర♦యోధులఁ జొచ్చిన నేల దూరినన్.

[తెరలోఁ గలకలధ్వని. అభిమన్యుఁడు సారధి రధ మెక్కి ప్రవేశము.]

అభిమన్యుఁడు—

చ. నిలు నిలు కర్ణ యోగురుఁడ ♦ నిల్వు ము సైంధవ నాగకేతనా నిలు నిలు ద్రోణపుత్ర కృప ♦ నిర్వెరబోకు సుయోధనానుజా! వెలవెలఁ బోవ నేల? నుడు ♦ వీరుఁడ పద్మము జించి మిమ్ములన్ దలపడు పార్థనందనుఁడు ♦ దాగక నిల్వుఁడు పారిపోకుఁడీ.

సుమిత్రుఁడు—నీవు బాలకుఁడవు. పద్మవ్యూహము జొచ్చి మరల రాగలవో లేదో?

క. మొగ్గరముఖమున ద్రోణుం డగ్గయున్నాఁడు మనల ♦ నడ్డక విడునే? డగ్గఱఁ జూపుము నీదగు పెగ్గెమొ? సుభద్రకుమార ♦ పెడముఖ మిడకన్.

అభి—సూతుఁడా!

చ. సురనికరంబుతోఁ ద్రిదశే ♦ సోముఁడు దాకిన, శూలహస్తుఁడై పురహరుఁ డేగుదెంచిన, న ♦ భోమణి తేజుఁడు సవ్యసాచి భీకరశరవహ్నిఁ గప్ప నసఁ ♦ గందను మార్కొని ద్రోణుఁ డోర్చునే? బిఱబిఱఁ దేరు పోనిమ్ము ♦ పీచమడఁచెద పింరయోధులన్.

పాండవచమూనాయకులారా! మొగ్గరముఖము ఛేదించి చెం డాడఁ జొరఁబడుచున్నాఁడ. పాండవరాజు వెల్ల నావెంట నంటి రం డు. తడయ మీకిందు దారి దొరకదు.

(పద్మవ్యూహము ప్రవేశించుచున్నాఁడు. పాండవసేన వెంట వచ్చును.)

ద్రోణు—పంచాననకిశోరముమాడ్కి యర్జునకుమారుఁడు మొగ్గరము ఖము ఛేదించుచున్నాఁడు. ఒక్కమ్మడి దాకవలయు.

దుర్యో—బాలునికై యింత భయపడ నేల?

ద్రోణు—వ్యూహములోనికి బాలుఁడు రాగలఁడా యని యుపేక్షచేయ కుఁడు. వీఁడు బాలుఁడా? రిపుకులాంతకుఁడు. పాండవసేనలు రాక ముందే వీని వధింపవలయు.

సైంధవుఁడు—పాండవసేనల నడ్డుట నాపని

గీ. తొల్లి నేఁ జేయుతపమున • కుల్లసిల్లి
శూలి వరమిచ్చె నొకనాఁడు • సొక్కి కేను
పాండుపీరుల నోడింప • బవరమందుఁ
బాఱదోలెదఁ జూడుమీ • పాండుసేన.

భండనోత్సుకులగు నోపాండవసేనాతండములార! ఇదే సింధు రాజు మీకడ్డుపడుచున్నాఁడు.

(నిష్క్రమించును.)

దుశ్శాసనుఁడు—నాగధ్వజా! నే సుచేంద్రపౌత్రుని ఢీకొని వాని విజృం భణ నివారించెద.

(అభిమన్యున కెదురగుచున్నాఁడు.)

అభి—ఓహో! సుయోధనానుజులో! రండు, రండు.

గీ. కుంతిభోజుని గూతుఁ • కోడలనకఁ
గండకావర మెగఁదట్టి • కన్నుఁగప్పి
నాదుపెత్తల్లి శిఖబట్టి • నాఁడు వీఁడు
వీనిశిఖబట్టి ఖండింతు • వెంబడించి.

(తలమిపట్టుకొనుచున్నాఁడు.)

సుమి—వీరాగ్రణీ ! వీనిఁ జంపకుము. విడువుము. వీనిరక్తము పానము జేయ మనపానని బంతముపట్టినాఁడు. నభోమణి దారులు దప్పినను, సప్తశైలములు దిద్దిర ద్రిమ్మరి నేలఁ గూలినను తనప్రతిజ్ఞ మానఁడు గాన వీని విడువుము.

అభి—ఛీ ! బ్రతికితివి. పొమ్ము. (దుశ్శాసనుఁడు పాఱిపోవుచున్నాఁడు.)

[దుర్యోధనుఁడు ప్రవేశము.]

అభి— దుర్యోధనచక్రవర్తులో !

సీ. జ్ఞాతివైరము బూని ♦ జ్ఞానశూన్యత నీటఁ
బావని ద్రోసిన ♦ పాపబుద్ధి
యారగింపగనున్న ♦ నన్నంబులోపల
విషముబెట్టిన యవి ♦ వేకయుతుఁడు
కపటగృహంబునఁ ♦ గాపురంబును బెట్టి
యనలముదాపిన ♦ యసురబుద్ధి
మాయజూదము బన్ని ♦ మారాజ్య మోడించి
వనముల కంపిన ♦ వంచకుండః
గీ. కొప్పుబట్టించి యీడ్పించి ♦ కొలువు జేర్చి
చీర లొలిపించి పాంచాలిఁ ♦ జిక్కుబెట్టి
నట్టి యాసుయోధనుఁ డిపు ♦ డవులగించెఁ
జిత్రవధఁ జేతుఁ దంత్రముల ♦ చిక్కుదీర్త.

ఓకురుకులాంబుధిబడబానలుండ ! సౌభద్రుం డప్రతిహతక్షాత్రతేజుం డని యెఱుగక కఁ గార్చిచ్చున కభిముఖమగు మృగము చాడ్పున నాకెదురైతివి. పెద్దలసభలో మాపెత్తల్లిని యంకపీఠము జేరరమ్మని బిలచిన యాసుద్దులఫల మనుభవింపుము.

దుర్యో—ఓరీ ! డింభక ! ఒకచెంపఁ గొట్టిన నీరు మఱియొకచెంపఁ గొట్టిన పాలు. నీ కీరాజసంపుఠివి యెవరు నేర్పిరి. పసిబాలుఁడవని నీముద్దుమాట లింతవరకు విని యూరకుంటిని. నోటికివచ్చినట్లు ప్రేలక నీతంత్రములఁ దోఁడు తెచ్చుకొనుము. లేదా! యీయనర్గళ కాల

వహ్నిసన్నిభభయంకరగదాఘాతంబున కెరయయ్యెదవు.

(గద త్రిప్పుచున్నాఁడు.)

సుమి — సురేంద్రపౌత్ర !

గీ. భీమగదఁబూని మనజట్టి • భీముఁ డితని
తొడలు తెగవేసి చంపఁగా • దొడ్డప్రతిన
బట్టియున్నాఁడు మనకేల • వంతగింపు ?
విడచి పొమ్మను విన్నవింతు • వీరపుత్ర !

అభి—నాన్నలప్రతిజ్ఞలు వీరిమరణమహోత్సవమున కడ్డుపడుచున్నవి.
కానిమ్ము ! పోపొమ్ము. బ్రతుకుము.

దుర్యో—బాలుఁడవని విడిచితిని. పొమ్ము. (దుర్యోధనుఁడు పాఱిపోవుచున్నాఁడు.)

[కర్ణుఁడు ప్రవేశము.]

కర్ణు—అర్జునుని యదృష్ట మేమనవచ్చు.

ఉ. బాలకుఁ డందఱన్ బలిమి • బాఱగఁ దోలగఁ జాలియుండె; యా
భీలదవానలోగ్రపటు • భీకరబాణనికాయ మోర్చి వీఁ
డాలములోనఁ బెద్ద కదు • పారగఁ గన్ననరుండు ధన్యుఁడౌ
కాలమహాత్మ్యమేమొ ? నను • గాదని ధిగ్మజుఁ బెద్దఁ జేతురే.

గీ. పుత్ర రమ్మని కౌఁగిటఁ • బూని పేర్మిఁ
జంచు ముద్దాడి సుఖరాసి • జూరఁగొనగ
నోచనైతిని పార్థుని • నోములెల్ల
ఫలము గాంచెను సౌభద్రుఁ • బడయుకతన.

అభి—సూతపుత్ర ! రాధేయ !

కర్ణు—(స్వగతము) కౌంతేయాగ్రజుం డనుము. నాకంతటి భాగ్యమా ?

అభి— గీ. అసురభావము మదిబూని • యపుడు సభను
నోటవచ్చిన విధముగా • సూటిపోటి
మాట లంటివి పెత్తల్లి • మదిని కుంద
నామహాదోషఫల మిపు • డనుభవింపు.

(తెలుముగా కర్ణుఁడు పాఱిపోవుచున్నాఁడు.)

వీఁడవరు లందఱు నన్నుఁ జూచి పాఱిపోవుచున్నారు. అదుగో! సైంధవుఁడు పెదనాన్నగారి కడ్డమై మనసైన్యములఁ గానిప్వకున్నాఁడు. అటు రథము నడుపుము. (నిష్క్రమించును.)

[ద్రోణుఁడు, కర్ణుఁడు ప్రవేశము]

కర్ణు—గురుతిలకా! ఏమిచిత్ర మిది? భీకరశరవహ్ని గుప్పి బాలకుం డొకఁడు మన కౌరవసేనలఁ బిల్కుమార్చెను. పాఱుని బాణసార మెఱుఁగనిది కాదు. సౌభద్రుని శరవిన్యాస మసదృశము. దుర్యోధన దుశ్శాసన కర్ణులు నిలువఁజాలకఁ బాఱివచ్చిరి.

ద్రోణు—అంగరాజా!

గీ. కవచధారణ మనువిద్య ♦ గఱపినాను
బార్థునకుఁ దొల్లి దానిని ♦ ఒడసె నితఁడు
ధనువు చేత నుండఁగ వీనిఁ ♦ దాకఁ దరమె?
హరిహరాదుల కైన నా ♦ యజుని కైన.

వంచించి మాయోపాయంబులఁ జంపవలెఁ గాని ముఖాముఖిని వీనిఁ దాక దేవదానవుల కైన నలవి కాదు.

కర్ణు—మఱేమిగతి?

ద్రోణు—చాటుగా వెనుకనుండి వీని విల్లు నీవు దునిమితివా నేను విరథుని జేసెద మఱియొకరు కవచమును ఛేదించవలయు. నిరాయుధుఁడు విరథుఁడు కాగా వశమగును.

కర్ణు—అందఱ మొక్కుమ్మడి వీని వంచింతము. రారమ్ము.

(దాగుచున్నారు.)

[అభిమన్యుఁడు ప్రవేశము]

అభి—గీ. పాఱిపోయిన క్షాత్రము ♦ పలుచఁబడదె
నిలచి పోరుఁడు కౌరవా ♦ నీక మెల్ల
రాక్షసుఁడు కాఁడు వీఁడు వీ♦రాధివీర
పార్థుపట్టి జగజ్జెట్టి ♦ పందలార!

(చాటునుండి కర్ణుఁడు బాణమేసి యభిమన్యుని కార్ముకము ద్రుంచును)

అభి—

ఉ. చాటున దాగి దొంగవలెఁ • జాపము ద్రుంచితి వెట్టినేర్పు వా
చాటనిశాల ! నా కెదుటఁ • జాలకఁ బంచలఁ బొంచి వేయ నే
పాటిది ? నీదుశూరత వి•పాకము గాంచెదెనె కర్ణసంతతుల్
ప్రేటున కోర్తు వేమొ ? నిలు • వీర్యసమేతము ఖడ్గ మోర్వరా !

హయశ్రేష్ఠములతో నారథము భగ్నమై నేలఁ గూలుచున్నది. సుమిత్రుఁడా ! ఇదే వచ్చుచున్నాఁడ. అయ్యో ! రథము వెంట నీవు నేలంబడుచున్నావా ? అది యుక్తమే !

గీ. మేలు ! సూతుఁడ ! సుమిత్రుఁడ ! • మేలు మేలు !
తేరు గుఱ్ఱాల విడలేకఁ • దెగువఁబూని
యరగినాఁడవె ! స్వర్గ మో • యార్య నీకు
ముఖ్యమాయె స్వకర్మము • మోసగాండ్ర
దివికిఁ బంపెదఁ జూతువు • దివమునుండి.

దుర్యో—వివ్వత్సుసుతుఁడు సగము జచ్చె. విడువక వెంటనంటి తఱుముఁడు. (నిష్క్రమింతురు)

(అభిమన్యుఁడు గదబూని రక్తస్రుములతో)

అభి—అబ్బా ! దాహము నోటఁ దడి యారిపోవుచున్నది. పంచప్రాణములు బహిర్గత మగుచున్నవి. గతదయార్ద్రమానసులు, లోభమనస్కులు కౌరవేయులు, తగదనుమాట లేక, రణకర్మము కాదని తలుపక, విగతధనుర్ధరుని, సమరపిక్ష్యదవానలుని, యొంటరిని నన్ను వేటకాండ్రు మితిమీఱి యొక మృగమును గొట్టువిధంబునఁ బట్టుచున్నారు.

[గదబూని యశ్వత్థామ ప్రవేశము]

చ. గురుఁడవు బ్రాహ్మణోత్తముఁడ! • కూడదు నీకని తోచలేదె? యీ
సరణిని శిష్యవర్గములఁ • జంపక విప్రత పూర్తి కాదె ? యా
కురుకులనాశకుం డెరయఁ • గూరిమి కూర్చిన సోదరుండె ? యా

పురహరు మించువాఁడు పరిపూర్ణుఁడు కుంభజుఁ డంపెనే నినున్ ?
నిరాయుధుఁడు, విరథుఁడు నై యేకాకియగు మాశిష్యపుత్రుని భీముగదచే మోది కృతకృత్యుఁడవు కమ్ము.

అశ్వ—సహింపఁజాల. సహింపఁజాల !

ఉ. జానెఁడుపొట్టకై శరుల ♦ జంతుసమానులఁ గూడుట స్సదా
మానితశౌర్యరాశి నస ♦ మానపరాక్రమశాలి నెందఱో
పూనికతో ముఖాముఖిని ♦ బోరకఁ జాటునఁ జంపనెంచఁగా
దానవ! చూడ నోర్చితివె ? ♦ తాల్మివహించి మహీసురాధమా !

(నిష్క్రమించును.)

[ద్రోణుఁడు ప్రవేశము]

అభి — కురుపాండవగురుఁడవట్లు నో బ్రాహ్మణోత్తమా !

ఉ. మర్మము దెల్పి యీగతికి ♦ మమ్ములఁ దెచ్చినవాఁడ వీవె యీ
నిర్మలమూర్తి పార్థునకు ♦ నీవిపు డిట్టిదు పుత్రశోకమున్
ధర్మమె ? పల్వు రేకమయి ♦ తాకుట నొక్కనిఁ జాటుపోరు స
త్కర్మమె ? యోధవీరుఁడవు ♦ కాదని చెప్పగ నెంతవాఁడనే !

జగదేకవీరుండవగు నో జనకా ! నీగురుండు నీయందు శిష్యవాత్సల్యతచే నీకుఁ బుత్రశోకదానం బివ్వవచ్చినాఁడు.

ద్రోణు—అబ్బబ్బా ! యీబాలకుని వాక్యములు— వినఁజాల. వినఁజాల ! స్వధర్మంబు విడనాడి క్షత్రియధర్మము బూనుటచేఁ గదా నా కీదురవస్థ పట్టినది.

సీ. బాలుని శత్రుభీకరుని ♦ పార్థకుమారుని, శిష్యపుత్రకుఁ
జాలి దలంపకన్ బలిమిఁ ♦ జంపగ నెంచితి భూసురుండనే ?
కూళను పాపకర్ముఁడను ♦ ఘోరము జేసితి చేతులార యిం
కేల గురుండ నే ననుట ♦ యెంతటి పాపినో, యెంత ద్రోహినో ?

(నిష్క్రమించును.)

అభి - జగజ్జట్టి సుభద్రాపట్టి నేఁ డధర్మపరుల బాధింబడి దిక్కులేక మడియుచున్నాఁడు. అన్నన్నా ! వీరాధివీరుఁడవగు బాండవమధ్యముని

పుత్త్రుండు, దేవదేవుండగు శ్రీకృష్ణునిమేనల్లుం డేకాకియై దిక్కులేకఁ జావమని నలువ తలవ్రాసె. అయ్యో! భరతఖండమా! శ్రీకృష్ణభగవాను లవతరించి యుండగనే నీయందధర్మము బ్రవేశించుచున్నదే! క్షాత్త్రమా! నశించుచుంటివా? ధర్మమా! క్షీణించెదవా? హిందూదేశమా! హిందూదేశమా! ముందు నీగతేమగును? భూసురులు స్వధర్మము విడచిరి. క్షత్త్రియులు కులధర్మములు మరచిరి. భారతమాతా! మ్లేచ్ఛాధీనమయ్యెదవా?—పాపము—పుణ్యము కాలము—హా—హా—హా— (పడిపోవును.)

రంగము పూర్తి.

## మూఁడవ యంకము—నాల్గవ రంగము.

ధర్మజుని శిబిరము.

[ద్రౌపది ధర్మరాజుల ప్రవేశము]

ద్రౌపది—గీ. భీష్ము డీల్గెను సైంధవు • వీచమడగె
ద్రోణుఁ డేగెను మదికింక • దుఃఖమేల?
పాండవాగ్రజ! యర్జుని • బావనిసుతుఁ
ఊరగినారని కుందితే • యఘవిరహిత!

యుద్ధము మనకు సుముఖముగ నున్నది. మీ కడ్డుపడిన సైంధవుని మట్టుబెట్టిరి. మర్మములఁ దెల్పియందఱనేకముగఁ జేర్చి యధర్మమార్గమున నభిమన్యుకుమారుని జంపించిన ద్రోణుని బరిమార్చిరి. పార్థునికై దెచ్చిన కర్ణునిశక్తిచే ఘటోత్కచకుమారుఁడు మడసెను. కాని నేఁడో రేపో కర్ణునిఁ బాలికలనికి బలి యిడెదరు.

ధర్మ—సీ. కౌరవసభలోనఁ • గాంత నీ వందిన
పరిభవ మొకచెంప • బాధపెట్ట

నకలంకవీరుఁ డా ♦ యభిమన్యుఁ డొందిన
మరణంబు నొకపక్క ♦ మాడ్చుచుండ
కలికి! ఘటోత్కచ ♦ ఘనుఁ డాజిఁ బడినట్టి
కష్టము లొకవైపుఁ ♦ గాల్చుచుండ
ద్రుపద విరాటులు ♦ ద్రోణునిచేఁ బడి
దూలుట నొకచక్కిఁ ♦ ద్రొక్కుచుండ

గీ. లేవలేనట్టి నామీఁద ♦ లేమ వినుమ
ఫెళ్లుమని పడె కర్ణుఁడన్ ♦ పెద్దపిడుగు
కదనసీమను నన్వాఁడు ♦ గాసిఁబెట్టె
చావు తప్పెను బ్రతికియుఁ ♦ జచ్చితిఁజెలి!

[కృష్ణార్జునులును ప్రవేశించి నమస్కరింప పెడముఖ మిడును.]

అర్జు—అన్నగా రేటికో మారుముఖ మిడిరి. పాంచాలి తల వంచినది. అగ్రజా! సోదరునిఁ జూడవేమి?

ధర్మ—చ. బవరము మాని వచ్చితివె? ♦ పాండవముఖ్యమ! కర్ణుఁజంపక
న్నవముగ నున్న నన్నుఁ గన ♦ సంతస మాయెనె? కోర్కె దీరెనే?
శివునిఁ బ్రసన్నుఁ జేసుకొని ♦ చెందినసిద్ధులు తిండికోసమా?
కవచము విప్పితే ఖలుఁడు ♦ కర్ణుఁడు సంగరరాజ్య మేలగన్.

ఉ. దేవత లిచ్చినారు ఘన ♦ దివ్యశరాళి కిరీట శంఖముల్
సేవలనుంచితో రథము ♦ నెచ్చట దాచితొ యస్త్రశస్త్రముల్
చావకనుంటకున్ ఫలము ♦ సంగరమున్ విడి పాఱివచ్చుటా
నీ వనిఁ గర్ణుఁ గూల్చకనె ♦ నిర్మలకీర్తి వహించ నేర్తువే?

గీ. దేవదత్తము మకుటము ♦ దీసివైచి
గురుఁ డొసంగినవిద్యల ♦ గూటఁబెట్టి
శూలియిచ్చిన యస్త్రము న్ ♦ జూరఁజెక్కి
యొప్పగించుము గాండీవ ♦ మెవరికైన.

అర్జు—హా! చచ్చితివి-చచ్చితివి- (కత్తిదూసి ధర్మజుని వేయఁబోగా కృష్ణుఁడు ద్రౌపది పట్టుకొందురు.)

ద్రౌప . ఇదేమిచిత్రము !

గీ. కత్తిదూయుంగ నేటికిఁ ♦ గానరాదు
శాత్రవులిచట సంగర ♦ స్థలము కాదు

కృష్ణు— ఖడ్గ మొరలోన వేయుము ♦ కఠిన మేల ?
కర్ణుఁ జంపగ రారమ్ము ♦ కదనమునకు.

అర్జు— బావా ! ఘోరపాతము దెచ్చుకొంటిని. నాగాండీవ మితరుల కర్పింపు మనువాని శిరము ఖండింతునని ప్రతిజ్ఞ జేసి యుంటినే ! ఏమిగతి ? నాప్రతిజ్ఞ చెల్లించి ధర్మముఁ గాపాడుము.

కృష్ణు—అర్జునా ! పెద్దల నిందించుట వారిఁ జంపుటే ! అగ్రజుండు, ధర్మపరుండు, సత్యసంధుఁ డగునన్నను దూషించితివా నీప్రతిజ్ఞ చెల్లును.

అర్జు —నీయాజ్ఞ నివర్తించెద.

ద్రౌప—ఆహా ! ఏమిముప్పు వాటిల్లునో ?

అర్జు

శా. జూదంబాడి సుయోధనానమునిచే ♦ సామ్మెల్లఁ గోల్పోయి నా
నాదైన్యంబుల నందఁజేతివి ని ♦ న్నమ్మంగ నేనొల్ల నీ
చా ! దేశంబుల కంపినావు ఖలుఁడా ! ♦ చాల్చాలు నీమాటలన్
వేదోక్తంబు లటంచు నమ్మి చెడఁగా ♦ వెఱ్ఱెత్తెనే మాకికన్.

గీ. సత్యవాదిని నేనంచు ♦ సాటి సాటి
బొంకి ద్రోణుని జంపిన ♦ పుణ్యమూర్తి
ధర్మమని పేరుఁబెట్టుకఁ ♦ దండ్రి తాత
సుతహితాదులఁ జంపెడి ♦ జూదగాఁడ.

నీవు జూదరివి, కల్లరివి. కర్ణుని యడ్డుట పణముల నొడ్డుట యను కొంటివా ?

సీ. అడ్డసారెలఁ బూని ♦ యాడుట కాదని
కర్ణకార్ముకముక్త ♦ ఘనశరాళి

మునిపుంగవులఁ గూడి ♦ ముచ్చటించుట కాదు
భార్గవశిష్యుని ♦ బాణచయము
నియతిఁ దపించుచు ♦ నీట నిల్చుటకాదు
రాధేయుఁ గెల్చుట ♦ రణమునందు
సకలబ్రాహ్మణులకు ♦ సంతర్పణము కాదు
సూతపుత్రుని ఢాక ♦ జూడవలెను

గీ. అడవుల కడునిడుము లంది ♦ యాకలములఁ
దినుచుఁ దిండి తిప్పలు లేకఁ ♦ దిరుగుటౌన ?
కర్ణబాణానలజ్వాల ♦ కదనభూమిఁ
గప్పినప్పుడు నిల్చుట ♦ కదలకుండ.

అహా ! ఏమి యింత ! విడిబడి నోటికివచ్చినట్లు జనకసమానుండు, నిర్మలతేజుండు, నిత్యసత్యవ్రతుండు, ధర్మదేవుం డగు నగ్రజుని నిందించుచుంటి. కట్టా ! నాకీదుష్కర్మ మెట్లు తొలగును ? నాదూషణ చెవులకు ములుకులుకాఁగ ఖిన్నుఁడై, విచారసాగరనిమగ్నుఁడై తలవంచియున్న నాప్రియసోదరు నెట్లు పలుకరింతు ? ముఖ మెట్లు చూడఁగలను ? ఛీ! నాజన్మ నిరర్థకము ! వ్యర్థమగు నీజీవితయాత్రను వృద్ధిఁ జేయుటకన్న నీకరవాలముచే నంతమొందించుట మేలు. (కత్తితోఁ గొట్టుకొనఁబోవ ద్రౌపది యడ్డుపడి)

ద్రౌప—ఏమి ! ఇట్టి దారుణకార్యము ధనంజయుఁడు చేయనగునా ? ఆత్మహత్య యూర్ధ్వలోకగమనమున కభ్యంతరము కాదా ? అయ్యో ! అట్టినీచకర్మకు లోఁబడుచుంటివేమి ? అన్నా ! శ్రీకృష్ణ ! నీవైన వారింపవా ?

కృష్ణు—ఫల్గుణా ! చాలు. చాలు. నీకార్యము కట్టిపెట్టుము.
అర్జు—దేవా ! గురునిందకు దేహత్యాగమే ప్రాయశ్చిత్తము.
కృష్ణు—ఆత్మస్తోత్రము మరణముకన్న హేయమని యెఱుఁగవా ?
అర్జు—తన్నుఁ దాఁ బొగడుకొనుట తన్నుఁ జంపుకొనుటే !
కృష్ణు—ఆత్మస్తోత్రము చేసుకొనుము. దాన గురునిందాదోషము నీకుఁ

దోలగును.

ద్రౌప — సకల ధర్మస్వరూపుఁడగు శ్రీమన్నారాయణుని మహోపదేశ మంగీకరింపుము.

అర్జు — వీఁడు సవ్యసాచి. దేవదానవుల గెల్చిన మహావీరుఁడు. గరళకంఠుని మెప్పించి పాశుపతం బందిన దివ్యమూర్తి.

సీ. ఖాండవవనమును ♦ గాల్చితి పనిఁబూని
యక్షయశరధుల ♦ నందినాఁడ
సకలాస్త్రసిద్ధుల ♦ సాధించి తెచ్చితి
దానవకోట్లను ♦ దరమినాఁడ
నిటలాక్షు మెప్పించి ♦ పటుబాణమునుఁ గొంటి
సంశప్తకులనెల్లఁ ♦ జంపినాఁడ
భీష్మభానునిఁబట్టి ♦ పీచం బడంచితి
కురుసైన్యముల నెల్లఁ ♦ గూల్చినాఁడ

గీ. శ్వేతవాహన, వాసవి, ♦ విజయ, కృష్ణ
సారథి, కిరీటి, భీభత్స, ♦ సవ్యసాచి,
పార్థ, యర్జున, నర యనఁ ♦ బరగుపేళ్ళఁ
గంటి నాకన్న ధీరుఁడు ♦ కలఁడె భువిని ?

ధర్మ — మీరు నామూలకమున సకలకష్టములఁ బడితిరి. నిజమే. నే లేకున్న మీకు సుఖము కలుగును. వనంబున కేగి తపోనిష్ఠఁ గాలము గడపెద. రాజ్యసుఖముల మీ రందుఁడు. (లేచి పోవుచుండ ద్రౌపది యడ్డగించి)

ద్రౌప — శమదమాదిసద్గుణభరితుఁడవు, ధర్మమునకపరమూర్తివి, యజాతశత్రుఁడవు—నీవే త్వరపడినఁ జెప్పువా రెవరు ? అర్జునుఁడు నీకుఁ బరమభక్తుఁడు. విశ్వాసముగల సోదరుఁడు. కారణము లేక నిట్లొనర్చునా ?

కృష్ణ — కౌంతేయ ! అర్జునుఁడు వ్యర్థప్రలాపి కాఁడు. గాండీవ మితరుల కిమ్మని నీవు మాటవరుస కంటివి. అట్లనువానితలఁ గొట్టెద

నని పార్థుఁడు ప్రతిన బట్టియున్నాఁడు. ప్రతిజ్ఞాభంగము గాకుండ నిన్ను నిందించమంటి. గురుదూషణదోషం బంటకుండుటకు నాత్మస్తోత్రము జేసుకొనమంటి. నీ వెఱుంగని ధర్మము కలదా? అర్జునా! ఆకర్ణుని జంపుటకు నగ్రజుని యనుమతి వడయుము.

అర్జు—కర్ణవధదీక్షాపరుండగు భీభత్సుఁ డగ్రజుని పాదంబుల కెరగుచున్నాఁడు. మన్నించి యాశీర్వాద మిచ్చి పంపుము.

ధర్మ—అర్జునా! లెమ్ము. కర్ణుని వధించిరమ్ము. నీకు జయ మగుఁగాక.

[తెరలో] రక్షింపుము. రక్షింపుము. ఎవఁడో రాక్షసుఁడు భీభత్సాకారముతో శిబిరముఁ జొచ్చుచున్నాఁడు.

[భీముఁడు రక్తము నోటను చేతులఁ గొట్టుకొని వచ్చును.]

అర్జు—కృష్ణా! రాక్షసుని వధించి శిబిరరక్షణము చేసెద.

భీము—పాండవసేనలారా! నే రాక్షసుఁడ కాను. పాఱిపోకుఁడు.

ఉ. ఆసభ నాఁడు ద్రౌపదిని ♦ హాసముఁ జేయుచుఁ గొప్పుబట్టి యేచ
వాసవి చూచుచుండఁ దన ♦ వామకరంబున నీడ్చినట్టి దు
శ్శాసను గొట్టి నెత్తుటను ♦ శాంతి వహించిన భీమసేనుఁ డా
యాసము లేక వచ్చి తన ♦ యన్నకు మ్రొక్కెడువాఁడు గంటిరే.

ధర్మ—తమ్ముఁడు—భీముఁడు—భీముఁడు!

ద్రౌప—ఇతని భీభత్సాకారము నా కెంత మనోహరమై కాన్పించుచున్నది.

భీము—తలోదరీ! నిన్ను సభ కీడ్చి తెచ్చిన దుస్ససేనుని వేడిరక్త మిది.

ద్రౌప—రక్తచందనలేపనముకన్న మిన్నగా నున్నది.

భీము—దేవకీనందనా! నీకటాక్షమున నాప్రతిన యొకటి చెల్లినది.

కృష్ణు—ధర్మజునిసోదరునకుఁ బ్రతిజ్ఞాభంగము కలుగునా? ధర్మతనయా! కర్ణుని సంహరించుట కర్జునున కనుజ్ఞ యిమ్ము.

భీము—దుర్యోధనుని జంపుటకు నా కనుజ్ఞ యిమ్ము.

ధర్మ—సోదరులవాంఛితములు సిద్ధించుఁగాత!

రంగము పూర్తి.

## మూడవ యంకము – అయిదవ రంగము.

### యు ద్ధ భూ మి.

[కర్ణుఁడు, శల్యుఁడు ప్రవేశము.]

కర్ణు—హా హో ! నేఁ డేమి యీరణక్షేలనవిలాసము !

గీ. శ్వేత కేతన ఫేనంబు ♦ చెలఁగుచుండ
దళతరంగచయంబు తాం♦డవము సల్ప
రథమదేభేంద్రఘీంకార♦రవము వెలయ
వీరసింధువు నామది ♦ విందు జేసె.

మద్రరాజా ! ఇట్టి వీరోత్సాహసమయమున, నాదురదృష్ట మేమో ! నాయావేశ మడుగంటినది. నాయుత్సాహము నీరైపోయినది. నాదివ్యాస్త్రములు నిస్తేజములై, నిర్వీర్యములై, నిస్సారములై, నిరుపయోగములై కాన్పించుచున్నవి. ఇదేమివిపరీతము ! నా దేహము కంపించుచున్నది. నాశిరము దిర్దిరఁ దిరిగిపోవుచున్నది. నామానసము వికలమై నైసర్గికస్థైర్యమును గోలుపోవుచున్నది.

శల్యు—అంగరాజా ! వీరాధివీరుఁడవగు నీకిట్టివికార ముదయించుటకుఁ గారణ ముండదా ?

కర్ణు—ఆఁ ! జ్ఞప్తికి వచ్చుచున్నది.

శల్యు—అది పరమరహస్యము కాదు గద ?

కర్ణు—తొల్లి నే నొకనాఁ డస్త్రవిద్య నేర్చుకొనుటకుఁ గోరిక జనింప,

చ. ఇరువదియొక్కమారు ధృత♦మీశుల పీచ మడంచినట్టి యా
పరశుధరుండె విద్య గరు♦పన్ దగునాజ్ఞ యటంచు నెంచి నే
పరుగున నేగి దండమిడి బాఁపడ ♦ నేనని మోసగించితిన్
సరగున నస్త్రసంచయము సాంగముగా ♦ వినుపించె నాతఁడున్.

శిష్యులకు మేటినై ప్రవర్తించుచుండ నొకనాఁడు మద్గురుండు నిద్రాసక్తుఁడై నాతొడపై శిరమిడి నిద్రించుచుండ మద్రాధిపా !

కాలమహిమ యెట్టిదో ! అప్పుడొక కీటకము నాతొడ ఛేదింపనా రంభించె. నాకు కలిగిన బాధ యింతయని వర్ణింప నలవికాదు.

గీ. గునపములు వెయ్యి తొడలోనఁ • గ్రుచ్చినట్లు
రంపముల కోటి తొడక్రింద • రాచినట్లు
కాచి కరగించి సీసము • కార్చినట్లు
దోచె మదికెంతొ ఘోరము • తోచె నధిప.

ఆదుష్ట కీటకమున కెట్టి దంతములున్నవో కాని, నాతొడనుండి రక్తము కాలువై, ప్రవాహమై, వెల్లువై గురుతిలకుని సర్వాంగముల ముంచివైచె. గురు నిద్రాభంగమున కోర్వక నే కదలనైతి.

శల్య—నీ మనోనిబ్బరము కడు వర్ణనీయము.

కర్ణ—పరశురాముండంత మేల్కాంచి నాయొర్మిఁ బరికించి, సంశయించి "నీవు నిజముగా బ్రాహ్మణుఁడవా యని" ప్రశ్నించె, పిడుగు వంటి యాప్రశ్న విన్నంతనే నాగుండె ఝల్లుమనియె. నిజము చెప్పి క్షమింప వేఁడితిఁ గాని యాబ్రాహ్మణుండు కోపోద్దీపితుఁడై తన యొద్ద నేర్చిన విద్య సమయమునకు జ్ఞప్తికి రాకుండు నని శపించె. తచ్ఛాపఫలమే యిది.

శల్య—గీ. అస్త్రగురువులు లేనట్లు • యంగరాజ !
పరశురాముని సేవించఁ • బట్టి నీదు
యస్త్రమహిమలు పూర్తిగా • నంతమొందె
కట్టికుడిపించు మనపూర్వ • కర్మఫలము.

నీయస్త్రములు నేఁడు పని చేయవన్నమాటె ! అర్జునుఁడు మనల వెన్నంటి తఱుమకముందే గృహంబున కరుగుదము రమ్ము.

కర్ణ—శల్యా ! ఏమనుచుంటివి ? అర్జునునకు భయపడి పాఱిపోవుదు నను కొంటివా ? పుట్టుకతో నా కమరియున్న కవచకుండలము లుండువఱకు నన్నెవఁడు జయించఁగలఁడు ?

[తెఱలో బ్రాహ్మణుఁడు]

బ్రా—అంగరాజా! అసమానదానశౌరేయ ! యాచకుఁడ-యాచకుఁడ.

కర్ణు — బ్రాహ్మణోత్తమా ! వేవేగ విచ్చేయుము. నే ధన్యుఁడ.

(సూర్యుఁడు బింబమందు ప్రత్యక్షము.)

సూర్యుఁడు — దానవీరకర్ణా ! ఆ వచ్చువాఁడు సురేంద్రుఁడు. నీ కవచ కుండలముల నపహరించుటకు వచ్చుచున్నాఁడు. త్వరపడకుము.

(సూర్యుఁ డదృశ్యుఁ డగును.)

కర్ణు — గీ. వాసవుండట యర్థింప ♦ వచ్చువాఁడు
వెనుకఁదీయుఁడు కర్ణుఁడు ♦ వెకలి కాఁడు
దేహమైనను నిశ్శంక ♦ దేవపతికి
ప్రాణమైనను నర్పించు ♦ పరమభక్తి.

అర్థించవచ్చిన యోయాచకశిరోమణి ! వేవేగ విచ్చేసి నన్నుఁ గృతార్థుని జేయుము.

బ్రాహ్మ — నీవు దానకర్ణుఁడ వని నీకీర్తిచంద్రికలు దిగంతవ్యాప్తంబు లగుట విని ని న్నొకయర్థం బడుగ వచ్చితి.

కర్ణు — భూసురేంద్రుని సంతృప్తి జేయుటకన్న వేఱుపరమార్థ మేమున్నది ? కర్ణుఁడు బ్రాహ్మణోత్తములకు సదా విధేయుఁడు,

బ్రాహ్మ — నీవు వెనుకతీయుదు వేమో నని నామది సంశయాకుల మగుచున్నది.

కర్ణు — మహాత్మా ! మీా కట్టిసంశయముతోఁ బనిలేదు.

గీ. అంగరాజ్యము గోరిన ♦ నధికప్రీతి
నర్పణము చేతు నిప్పుడే ♦ యఘునిరహిత !
ప్రాణ మర్థింపు మిచ్చెద ♦ పాకవైరి
యడ్డుపడ రాని దివినుండి ♦ యబ్జవైరి.

అడ్డుపడినను కర్ణుఁ డాడితప్పువాఁడు కాఁడు. మీారు కోరున దేటిదైన నివ్వ సిద్ధముగా నున్నాఁడు.

బ్రాహ్మ — మీారాజ్యముతో, మీాధనములతో, మీాప్రాణములతో నగుల కేమిపని. నేకోరునది నీకవచకుండలములు.

కర్ణు — మహాత్మా ! నేఁడుకదా నాజన్మ సార్థకమైనది. ఈకవచకుండల

ములనేను పుట్టుకతోఁ దెచ్చుకున్నవి. మీరు గ్రహించుటచేఁ బరమపవిత్రము లగు. చేకొనుఁడు. మనఃపూర్వముగ నిచ్చుచున్నాఁడ. (ఇచ్చివేయును.)

బ్రాహ్మ—దాతవన్న నీవే దాతవు. నీకు సాటి కలరా? పోయివచ్చెదను,

కర్ణ—దేవా! మీపాదపద్మములకిదే వందనములు.

బ్రాహ్మ—నీవు దానకర్ణుఁడ వనుకీర్తి యాచంద్రార్కము బ్రహ్మాండమున నిత్యమై వెలయుఁగాత. (నిష్క్రమించును.)

శల్య—(స్వగతము) అబ్బా! ఇప్పుడుకదా నా కూపిరి సలిపినది. పార్థునకు జయము తప్పదు. (ప్రకాశముగా) అంగేశ్వరా! ఇప్పుడు నీ వేమిచేయఁదలచితివి. నీయస్త్రములా - బ్రాహ్మణశాపంబున నిస్తేజంబులు కదా! నీ విప్పుడు కవచకుండలములఁ గోల్పోతివి కదా!

కర్ణ—మద్రాధిపా! సహజశక్తిగలవారికి యుపకరణములతో నేమిపని? నిజక్షాత్రము నాసర్వాంగముల నిండియుండ నా కేమి భయము.

శల్య—రాధేయ! నీమాటలు నాకు నవ్వు పుట్టించుచున్నవి. క్షాత్రము క్షత్రియులసొమ్ము సుమా!

ఉ. సారము లేని యస్త్రములు • సారవిహీనము నీదు తేజమున్
సారము లేని విద్య గురు • శాపసమేతము నీదుశాస్త్రమున్
శూరవరేణ్యుఁ డర్జునుఁడు • శూలివరాద్భుతశక్తియుక్తుఁ డా
పీరవరాగ్రగణ్యు నరి • భీరభయంకరుఁ డెట్లు దాకెదో?

కర్ణ—కులముతో నేమిపని? గుణము ప్రధానము.

[తెరలో కృష్ణార్జునులు]

అర్జు—కౌరవచమూనాయకులారా! దుర్యోధనుని పరమమిత్రుఁడంగరా జెచ్చట నున్నాఁడు?

కర్ణ—శల్యరాజా! రథమారోపింపుము పార్థున కెదు రేగుదము.

శల్య—ఇదేమివిపరీతము! రథచక్రములు భూమిలో దిగిపోవుచున్న వేమి?

(కర్ణుఁ డెత్తుచుండును. రథము దిగిపోవుచుండును.)

కర్ణు—మద్రాధిపా! నేఁడు భూమిసహితము నాకు విరోధియైనది. తొల్లి భూదేవి నారథము యుద్ధభూమిని క్రుంగిపోవునని శపించినది. శాపఫల మనుభవించక తీరునా?

శల్యు—నీజీవితమంత శాపములతో నిండినది. అర్జునుని జీవిత మనుగ్రహములతో నిండినది.

[కృష్ణార్జునులు—ప్రవేశము.]

అర్జు—అంగరాజా! రథ మెత్తుటకు సహాయము కావలెనా?

కర్ణు—(స్నేహపీడితుండై స్వగతము) పరస్పరసహాయము మనకు కఁడు దూరమయ్యె కదా? నాకుఁ దమ్ముఁడవై జన్మించిన ఫల మను భవించలేకపోయితిని. బంధుజనులకు దూరమై, దూరమగుటే కాదు విరోధినై, సోదరులఁ బ్రేమించి కౌఁగలించుటకు మారుగా వారిపై దివ్యాస్త్రములఁ బ్రయోగించి వారిప్రాణములఁ బలికోరుచుంటి. నాజన్మమేల? కాల్పనా?

గీ. నాఁడు ముద్దులతమ్ముఁడు ♦ నన్నుఁ దాకి
కదనమున నుంట నాపూర్వ ♦ కర్మఫలమె;
బంధునాశము జేసెడి ♦ పందనగుట
కన్నఁ బ్రాణము విడుచుట ♦ కర్జ మిప్పుడె;

దేవదేవుండవగు నోగోపాల! నీలీలావిలాసమునకు మేర కలదా? ఇట్టివిపరీతములఁ గల్పించి లోకసమరసత్వమునకై పాటుపడి యానందింతువు. నీకు మిత్రులు శత్రులు కలరా? నాజీవాత్మ నీకై పరితపించుచున్నది. చేకొనుము. చేకొనుము. ప్రత్యక్షమున జగదీశ్వరుఁడవగు నిన్నుఁ గన్నులారఁ గాంచుచుండ నాదుష్కర్మ నశించకుండునా? నశించకుండునా?

శల్యు—కర్ణా! ఇదేమి విపరీతచర్య? పార్థుఁడు రణార్థియై యెదుట నిలిచియుండ నీకు మతి పోయినదా యేమి?

కర్ణు—దేవాదిదేవా! జగన్నాటకసూత్రధారీ! నన్ను నీలో నైక్యము

జేసుకోవా! దయ లేదా! నాపై నింకను కృప రాదా?
అర్జు—బావా! కర్ణుఁడు పలుకఁడేమి? మతిభ్రమ కాదుకదా? అంగ
రాజా! పాఱిపోవుటకా యోచనలు?
కర్ణు—పాండవమధ్యమా!

గీ. ఆడితప్పని ధర్మజుఁ ♦ డన్న నీకు
నండపిండము లాడించు ♦ హరి సఖుండు
అట్టి నీనిపు డవినీతుఁ ♦ డైతి వేల
నంచు చింతించుచున్నాఁడ ♦ యరిమృగేంద్ర.

శల్యు—ఇతఁ డస్త్రశూన్యుఁడు. విరథుఁడు. కొంచె మాగుము.

గీ. గురుని శాపానలంబున ♦ గుణము లేస
వి యితనిమహిమ లర్జున! ♦ వింతశాప
ములను గుఱియయ్యె పార్థ! నీ ♦ ముందు నిలువ
లేఁడు కొంచె మాగు రథము ♦ లేవనిమ్ము.

అర్జు—దుర్యోధనసఖ! ధర్మమనుమాట నేటికికదా నీనోట వెడలినది.

సీ. మాయజూదమునందు ♦ మమ్ము గెల్చిననాఁడు
ధర్మంబు నీమదిఁ ♦ దట్టలేదొ?
వనసీమలకు మమ్ము ♦ వంచించి పంపఁగా
ధర్మంబు నీమదిఁ ♦ దట్టలేదొ?
పాంచాలి సభలోన ♦ పరిభవించిననాఁడు
ధర్మంబు నేమూలఁ ♦ దఱిమినావు?
విషము మెసవ మాకు ♦ విందొనర్చిననాఁడు
ధర్మంబు నేదారిఁ ♦ దఱిమినావు?

గీ. ధర్మశూన్యుఁడ! నీవిట్లు ♦ ధర్మమంచుఁ
బెద్దసుద్దులఁ బలుకుట ♦ బుద్ధికాదు
రమ్ము రారమ్ము రణమిమ్ము ♦ రణవిలాస
ఖేలనమునకు సమయము ♦ బాలవైరి!

కర్ణు—ఓరీ! గర్వాంధ! నా శస్త్రములతోఁ బని లేదు. రథముతోఁ

బని లేదు. నాచేత నీఖడ్గ ముండెనేని—

గీ. దేవదానవసంఘముల్ • తెఱవాఱి
చూడఁజాలవు నీవెంత • సూన్యబలుఁడ,
నిలచి పోరుము నాథాక • నీకుఁ దెలియ
వచ్చు నిప్పుడే వ్యర్థంపు • వాదు లేల ?

కృష్ణు—అర్జునా ! ఏల సంశయించెదవు ? తరుణము మించనివ్వకుము.

గీ. మించనివ్వకు తరుణము • మించెనేని
తరము గాదయ్య నీతని • దరికిఁ జూడ
శాపమహిమను గోల్పోయె • శస్త్రబలము
పాశుపతమునఁ గొట్టుమీ • పార్థ ! యిపుడె.

అర్జు—సూతజా ! పాశుపత మిదే వచ్చుచున్నది.

(కర్ణుఁడు నేలఁ గూలును. కృష్ణార్జునులు నిష్క్రమింతురు.)

కర్ణు—శ్రీకృష్ణా ! నన్ను నీలోఁ జేర్చుకొనుము. సిద్ధముగ నున్నాను.

[దుర్యోధనుఁడు ప్రవేశము]

దుర్యో—అంగరాజా ! నన్ను విడచి పోవుచుంటివా ? నీవెంట నన్నేలఁ గొనిపోవు ? నీవు లేకున్న నీభూలోకము నిబిడాంధకారబంధురము సుమా ! నాప్రాణమిత్రుఁడవు. నాయనుంగుచెలికాఁడవు. ఇఁక నాకు యోచనలు దెలుపువాఁడెవరు ? నాకు రాజనీతి బోధించు వాఁడెవరు ? నాప్రాణమునకన్న మిన్నయని యెవని నెంచితినో, నా సర్వరాజ్యమైన నెవనివాత్సల్యతకు సమర్పింప వెనుదీయకుంటినో, యెవని భుజపరాక్రమమునకు సంతసించి యుద్ధము జ్ఞాతులతోఁ బెం చితినో, యేమహామహునియౌదార్యస్నేహసంపత్తికి వశుఁడనై మై మఱచియుంటినో యట్టి వీరాధివీరుఁడు, దానశీలుఁడు, సకలశాస్త్రా స్త్రవేది, నాచిన్ననాటిసఖుఁడు, నేమెచ్చిన ప్రియమిత్రుఁడు నన్ను విడచి నేఁ డరుగుచున్నాఁడు. నేనేల యీనిస్సారమగు భూమండల మున నుండవలయు ? కర్ణా ! నన్ను మఱువకు— ఇదే నీవెంటనే వ చ్చుచున్నాఁడ.

గీ. శాంతి నొందుము మిత్రమా! ♦ శాశ్వతంపు
కీర్తి పుడమిపై నెలకొల్పి ♦ కీర్తిశేషుఁ
డను పదము సార్థకము జేసి ♦ యరిగినావె?
జంటఁ బాయక నీవెంట ♦ నంటివచ్చు
వాఁడు చెలికాఁడు! నీవాఁడు ♦ నీడ తోఁడు!

కర్ణు—శ్రీకృష్ణభగవానులా? దేవా! వచ్చితివా, వచ్చితివా?
దుర్యో—కర్ణా! నేను నీమిత్రుఁడను- దుర్యోధనుఁడను.
కర్ణు— మిత్రమా! శ్రీకృష్ణదేవుని బిలుచుకరమ్ము- రమ్మనుము- రమ్మనుము—హా! కృష్ణా! (ప్రాణము విడచును.)
దుర్యో—మరణవేదనచే మతి తప్పినది. మిత్రుఁడస్తమించినాఁడు. యుద్ధము నిలుపవలయు.

(నిష్క్రమించును.)

రంగము పూర్తి.

## మూఁడవ యంకము—ఆఱవ రంగము.

### ద్వైపాయనహ్రదము.

[ఇద్దఱు కిరాతవేటకాండ్రు ప్రవేశము]

1 కిరా—మామా! దయ్యమా? భూతమా?
2 కిరా—అబ్బో! నీళ్లలో బొబ్బలిడుతుంది.
1 కిరా—ఊరుకో! వినరా! ఒళ్లు దడౌడుతున్నది.
2 కిరా—మనిసికూత! ఏంటాపిలుపు?
దుర్యో—(చెరువులోనుండి) భీష్మద్రోణకర్ణశల్యులు నిహతులైరి. సకలబాంధవసంహారము జరిగె.

1 కిరా—అయితే-ఏం-ఆహారము చాలదంటావా ? ఇదో పీన్గె తిను.
(2 వ కిరాతుని ముందుకుఁ ద్రోయును.)
2 కిరా—పీన్గి తింటే నీఆకలి తీరుతుంది. బలసినాడు. చూసుకో !
దుర్యో—కృప కృతవర్మాశ్వత్థామలు బ్రతికియుందురా ?
1 కిరా—వారిని తింటావా ? బాబో ! మన్ను వదలదురో !
(ఇద్దఱు కౌఁగలించుకొని యేడ్చుట)
దుర్యో—భీముఁడు నేఁ గన్నారఁ జూచుచుండ దుశ్శాసనుని రక్తము
త్రాగినాఁడు. తమ్ముఁడా ! నీవుండిన నాకీగతి పట్టునా ? కర్ణా !
యెచ్చట నుంటివి ? నీవు లేకున్న నాకీరాజ్య మేల ?
1 కిరా—ఏమవరు-ధని-మనం విన్నదేరా ! భీమదేవఁ దుశ్శాసనయ్య
నెత్తురు పీల్చాడా లేదా ?
దుర్యో—రాజ్యము ధర్మజుఁ డేలును- ఏలుకోనిమ్ము.
1 కిరా—దొరికాడురా- దొరికాడు. (సంతోషించును.)
2 కిరా—ఢొల్లు దగ్గరకు- మింగుతాడు.
1 కిరా—రాజుగారు- దొరికాడు.
2 కిరా—ఏ రాజసె ! భీమన్నదొంఱ ?
1 కిరా—ఏడిశావు ! పాతిపోయాడే- పెద్దదొంఱ.
2 కిరా—ధర్మరాజంట్రా ?
1 కిరా—నీమొకం- దుర్యోధనమహారాజురా !
2 కిరా—ఏమీ ! ఏమి ?
1 కిరా—విను-
దుర్యో—గీ. కర్ణుఁడేగిన మార్గము • కలదెనాకు ?
దొంగచాడ్పున నీటిలో • దూరవలసె
కంపమెత్తెను దేహముఁ • గడుపఁ జాల
నేలికోనిమ్ము రాజ్యము • లేల మనకు.
1 కిరా—నిజం ! దొంఱ దొరికాడు.
2 కిరా—మనలొట్టు నేతబష్టది. నేను పరుగెత్తి ధర్మయ్యతో చెప్పాను.

ఆరాలు- వుపారాలు- దానాలు, ధర్మాలు- అబ్బా. లెక్కా- ఇల్లంతా బంగారమే.

1 కిరా—నేను ముందు చెప్పాలె- బవుమానాలన్ని నాకే.

2 కిరా—నీకేమిటి- నాకే.

1 కిరా—పెద్దాణ్ణి నాకు.

2 కిరా—చిన్నాణ్ణి నాకు.

1 కిరా—నాకు. (కొట్టుకొనుచున్నారు)

2 కిరా—నాకు.

[ధర్మరాజు, భీముఁడు, కృష్ణుఁడు మొదలగువారు ప్రవేశము.]

1 కిరా—బాబు ! నాకు.

2 కిరా—దేవర ! నాకు.

1 కిరా—నాకే.

2 కిరా—నాకే నంతే.

ధర్మ—మతిపోయినదా ? తెలియఁ జెప్పఁడు.

1 కిరా— నేను చెప్పుతాను.

2 కిరా—వద్దు నేను చెప్పేది.

ధర్మ—ఎవరో యొకరు స్పష్టముగాఁ జెప్పఁడు.

1 కిరా—బాబయ్యో ! ఉన్నాఁడు.

2 కిరా—ఊరుకో_బాబు ! దొరికాడు.

ధర్మ—ఎవరురా ?

1 కిరా—నామాటినండి- వాడు చెప్పలేడు.

2 కిరా—వాడికేం తెలుసు. నే చెప్పుతా యీనండి.

ధర్మ—మీవంతములు మాని నిజముఁ బలుకుఁడు.

1 కిరా—పీడు కుత్తెదవ- నామాటసమ్మండి

2 కిరా—పీడు చెవిటిదన- నామాటంతాసత్యం.

ధర్మ—ఉన్నవాఁడు దొరకిన వాఁ డెవఁడు ?

1 కిరా—మన బొట్టిబాబు.

2 కిరా — మన దొడ్డదొర. మీాపాలపోతు.

ధర్మ — వీరేదో సంతోషవార్త చెప్పెదరు—వాఁడెవఁడు ?

1 కిరా — మనపెద్దదొర.

2 కిరా — అరే ఊరుకో— మనదొ్రపతమ్మగారి చీరెలు లాగించాడె

ధర్మ — దుర్యోధనుఁడా ? ఎక్కడెక్కడ ?

1 కిరా — ఈచెఱువులో— బాబు.

2 కిరా — నీళ్లలో రండిరండి, *

కృష్ణు — దుర్యోధనుఁడు శుక్రవిద్యల నేర్చినవాఁడు. జలస్తంభన ప్రజ్ఞ చే నీరు పాషాణ మగు నట్లొనర్చి జలాంతర్గతుఁడై యుండవచ్చు.

ధర్మ — మన కెట్లు గోచరమగును.

కృష్ణు — మాయకాని మాయవలనే సంహరించవలయు. రోషము పుట్టు నట్లు పలికితివా నీటనుండి వెలువడును.

ధర్మ — గీ. సకలబంధుల మిత్రులఁ • జంపినట్టి
సార్వభౌముఁడు మడుగున • జలక మాడఁ
జొచ్చెనో ? మమ్ము వంచింప • సూర్య సుతుని
జీవితుని జేయుఁ దపమును • జేయునేమొ !

చ. అలసభ నోటవచ్చినటు • లాడినధీరతవమ్మ పోయనే ?
కలకల నవ్వి మాతఱుణి • కట్టినపుట్టము విప్పనేర్తువే
చలము నశించెనే ? బలము • జచ్చెనె ? దాగినఁ బోరు మానునే?
బలుకవె కృష్ణుతో వసుధ • భాగము లివ్వనటంచు గర్వివై.

జలములు దాగిన బనరంబుదగునా ? క్షాత్రము విడచి పాఱిపో యిన మరణంబుఁ దప్పునా ? దుర్యోధనమహారాజా ! జలమునఁ బ్రవేశించి శ్రమ దీర్చుకొనుచుంటిరా ? పాపము ! భీష్మ ద్రోణ కర్ణశల్యాదులు వీరశయనంబంద దుర్యోధనచక్రవర్తులు జలశయనం బందిరి కాబోలు ?

ఉ. జూదము కాదు పెల్చుటకు • శూరులతో రణభూమిఁ బోరుటల్
వాదము కాదు బంధులతో • వాడికతారులపోట్ల కోర్చుటల్

మోదమున స్త్రీమణుల ♦ ముంగల వస్త్రము లూడదీయుటల్
కాదు సుమీ మహాహవము ♦ కౌరవనాయక ! లేచి రాగదే.

దుర్యో—సోదరా !

ఉ. రాజ్యము లొల్ల నేను రణ♦రాజ్యము లొల్లను నీతికోవిదా !
పూజ్యుఁడ వీవె రాజ్యమును ♦ బోషణ చేయుము దాన మిచ్చెదన్

ధర్మ—భోజ్యము యోధవీరులకు ♦ భూధవ! రాజ్యము దానమందగాఁ
బూజ్యత లేదు రాజులకుఁ ♦ బోరుము గెల్పుము లేచిరమ్మికన్.

నా వెఱ్ఱితమ్ముఁడా ! భీష్మద్రోణాదిమహావీరులు నీకొఱకుఁ బ్రాణము లర్పించిరి. బంధుమిత్రాదులు మడసిరే ! సకలక్షత్రియవినాశకుండవు నీవుమాత్రము ప్రాణము దక్కించుకొన్న రాజానీకము పక పక నవ్వరా ? నీవారందఱు నశించ నీవుండినఁ బ్రయోజన మేమి ?

దుర్యో—ఈవినాశమునకు నీధర్మశాస్త్రము కృష్ణుని రణనీతియుఁ గారణములు. ఈమహాశ్మశానవాటిక నేలికొనుట కీవే యర్హుండవు.

ధర్మ—నీబోటిదుష్టులు మడసినఁ గలుపుతీసిన చేనువలె శిష్టులు వృద్ధిఁ జెందఁగలరు. క్షత్రియుండవు దాగిన ఫల మేమి ? లేచి రమ్ము. పాండవుల జయించి కీర్తి నిలుపుకొనుము.

దుర్యో—నే నొంటరిగ నున్నాను. సైన్యములు లేవు. నిరాయుధుఁడను. మీరు చతురంగబలములతో సర్వాయుధములతో నున్నారు. శ్రమచేఁ గడు డస్సితిని.

ధర్మ—సుయోధనా ! నీ కాభయమేల ? రథము లిచ్చెదము. ఆయుధముల నిచ్చెదము. ఒంటరినని సంశయింపకు. మాయన్నదమ్ముల లోనెవరినైన నొకరి నెన్నుకొనుము. వానినోడించితివా రాజ్యమునీదే.

కృష్ణు—(ధర్మరాజును జాటుకుఁ బిలచి)

గీ. మఱపు రాదేమి జూదపు ♦ మాట బావ !
పందెమేయుటకు మనసు ♦ పాఱెనేమొ
మరల ? వీలు చిక్కిన పిదప ♦ మాయ నిన్ను
ముంచివైచును విడుమునా ♦ మూర్ఖుఁ డితఁడు.

దుర్యో—(గద త్రిప్పుకొనుచు లేచినవ్వి)

ఉ. సోదర ! నాకు నీడు సరిజోడు వృకోదరుఁ, డంవృ వాని నా
మీఁదకు వారుషీ రనగ • మెచ్చునె లోకము కీర్తి హెచ్చునే ?

భీ—మోదముఁజెందె మానసము • మూర్ఖుఁడ ! నిల్వుము పాఱిపోకుమా !
నాదుగదాప్రహారములు • నాళము లెల్ల విదల్చి చీల్చవో ?

దుర్యో—రమ్ము- రమ్ము ! సిద్ధముగ నున్నాఁడ.

భీము—రారమ్ము. సర్వసిద్ధముగ నున్నాఁడ.

(యుద్ధమునకు లోనఁ బ్రవేశింతురు)

అర్జు—చ. గగనమునుండి చూచియొర • కాంక్షజనింపగ త్రిప్పుత్రిప్పునన్
దిగి తలక్రిందుగా మనలి • తీర్చెదు క్రూరపు డేగకై వడిన్
పగ విడకుంటచే శశిని • బట్టగ వచ్చెడి రాహువుమాడ్కి రా
జు కను మదే వృకోదరుని • జూర్ణము చేయుదలంచె. మాధవా !

కృష్ణు—ధర్మజా ! చూడు, చూడు. సుయోధనుఁడు భీముని నుగ్గు
గాఁ గొట్టి యాకాశమున కెగిరి దిగుచున్నాఁడు. తొడలు తెగవే
యుమని భీమునకుఁ జెప్పకున్న మనభీముఁడు లేనివాఁడే. పోదము
రమ్ము. (నిష్క్రమింతురు.)

(తొడలు తెగి దుర్యోధనుఁడు పడును.)

దుర్యో—హాతోస్మి- హాతోస్మి ! ఎట్టిధర్మము కృష్ణా ? నాభి కధోము
ఖముగఁ గొట్టుట గదాయుద్ధమున నధర్మము కాదా ? ఇంతకు దై
వసాహాయము పాండవుల కున్నది. సర్వేశ్వరుండవని యెఱుఁగక
మోసపోతి.

[అశ్వద్ధామ ప్రవేశము]

అశ్వ—ఆహా ! చిత్రము !

చ. కపటగృహంబునం దనల • కాండము దాపిన ఘోరకార్యమే
ద్రుపదతనూజకేశముల • దుష్టతఁ బట్టిన పాపపుంజమే
యపరిమితార్భటిన్ హరిని • యడ్డగఁ జూచిన దోషభావమే
సఫలము జెందె నేఁడు • ఘనసాఘులవంచన రీతఁబోవునే.

రాజాధిరాజ! దుర్యోధనచక్రవర్తి! నేను గురుపుత్రుఁడ. నీ యాజ్ఞ నివర్తింప సిద్ధముగ నున్నాను.

దుర్యో—ద్రోణనందనా! మీయుపదేశముల గణింపక, శ్రీకృష్ణభగవానుని నిజతత్వ మెఱుఁగక తుద కీదురవస్థకు లోనైతి. మీరు విశ్వాసముగల పరమమిత్రులు. నే మిమ్ముల నాజ్ఞాపింప నెంతవాఁడను.

చ. గురుబల! పాండవాధములు ♦ కూలినమాటలు విన్నఁగాని నా
చురచుర మాన దింక రణశూరుఁడు భీముఁడు జావకుండినం
దిర మెటుగాంచు మానసము? ♦ ధీరుఁడు పార్థుఁడు నిల్చియుండ భూ
సురవర శాంతిగాంతునొకొ ♦ చూడగ నేర్తునె వారియుద్ధతిన్.

గురునందనా! కృపకృతవర్మలు నీసైన్యములు. నీవు నాయకుండవు. అపాండము గావించిరమ్ము.

అశ్వ—రాజచంద్ర! మాయమంత్రములనో, మందు మాఁకులనో మాయోపాయములఁ బన్ని పాండవ సంహారము గావించి వచ్చెద.

(నిష్క్రమించును.)

దుర్యో—రాజభక్తిచే నీ బ్రాహ్మణోత్తముఁడు ప్రతిజ్ఞ జేసెను. గాని కృష్ణార్జును లడ్డుపడిన వీని చేత నేమగును.

[అశ్వత్థామ భీభత్సకారముతో వచ్చి.]

అశ్వ—రాజా! బీరుపోకుండ నందఱ సంహరించితిఁ గాని పంచపాండవులు, ద్రౌపది, కృష్ణుఁడు కానరారైరి.

దుర్యో—నిష్ప్రయోజనము. భూసురోత్తమా! మీరు శాంతింపుఁడు. కురుకులేశ్వరుఁ డస్తమించుచున్నాఁడు.

అశ్వ—రాజసేవ యెంతనీచమైనది.

సీ. పాలు త్రాగుచు నున్న ♦ పసికూనలను బట్టి
నేలపైఁ గొట్టించు ♦ నెనరు లేకఁ
బతివ్రతామణులను ♦ బంధించి బలిమినిఁ
గఠినుల కర్పించు ♦ కరుణ లేక

సత్యంబు విడువక ♦ సంచరించుబుధుల
నెట్టించు మూలను ♦ నీతి లేక
నభిమానధనులను ♦ నదళించి బెదరించి
పెడమార్గమునఁ బెట్టు ♦ భీతి లేక
గీ. నీచవృత్తులఁ జేయించు ♦ నీతి లేని
జాతివారిని గవఁ గూర్చు ♦ భుక్తి కొఱకుఁ
జెప్పరానట్టి చైద్యముల్ ♦ చేయఁ బంచు
రమ్య మనరాదు కష్టము ♦ రాజ సేవ.

నిద్రించుచున్న పసివాండ్రఁ గొంతులు గోసితినే. నా జన్మ వ్యర్థము. తపంబాచరించి శిశుహత్యా దోషము మాపుకొనెద.

(నిష్క్రమించును)

దుర్యో—కృష్ణా! దేవదేవుండవని యెఱుగక నాడు సభ నీ కొనరించిన పరాభవము మన్నింతువుఁగాక! నీకై పరితపించు నాయంతరాత్మ నంగీకరింపుము. దేవా! క్షమింపుము. నీవాఁడ - రక్షింపుము.

[కృష్ణుఁడు ప్రవేశము]

కృష్ణు—ఉ. నీవును నీసహోదరులు ♦ నీచెలికాఁడు దినేశసూతియున్
నీవశులెల్ల దానవులు ♦ నేదనుజాంతకుఁడౌట జంపితిన్
భావము శూన్యమత్సగము ♦ పండిత మాన్యము సేయవయ్యనీ
జీవితయాత్రకున్ ఫలము ♦ జెందకమానవు శాంతినొందుమా.

గీ. శాంతి చేకూరుగావుత ♦ భ్రాంతి యుడిగి
శాంతులౌ గతరాజులు ♦ సకల జనులు
శాంతియౌగాక! హైందవ ♦ సంఘమునకు
శాంతి భారతమాతకు ♦ శాంతి శాంతి.

రంగము పూర్తి.

అంకము సమాప్తము.

7 వ పేజీలో 7 వ పంక్తికి తరువాత.

దృష్టద్యుమ్నుఁడు:—

సీ. హోమకుండము నుండి • హోమానలంబునఁ
బుట్టి నావెంట యీపూతగాత్రి
ద్రుపదేశ్వరుని పూర్వ • పుణ్యపుంజంబీమె
పూర్ణబింబాస్య యీ • పువ్వుబోడి
సకలవిద్యల తావు • సంపూర్ణ జవ్వని
కులగోత్రముల కీమె • గొప్పతావు
సరస సద్గుణ శీల • సౌందర్య ఘనరాశి
కన్యా లలామ యీ • కంజ నేత్రి
గీ. సింధుగంధర యాన యీ • సింహమధ్య
సుగుణములదొంతి శీలంపు • సొబగుబంతి
మాయ మర్మము నెఱుగని • మాన్య చరిత
పరమపావని బంగారు • ప్రతిమ సుండి!

22వ పేజీలో 3వ పంక్తికి తరువాత.

శిశుపాలుఁడు

శా. ఏఁడీ చూపుము మూఁడులోకములలో • నేరాక్షసుఁ డీల్గె నీ
చాడీకోరునిచే ముఖాముఖి ననిన్ • సాళ్వని జరాసంధునిన్
చెండాడెన్ దననాయనేర్పునఁ గదా • ఛేదించె నేపోరునన్
వీఁడా శూరుఁడు మృచ్చుగాని బలుఁడే • వెయ్యాట లాడించనే.

